# ఉదయ ఘంటలు

( అఖిలాంధ్ర కవుల గేయ సంపుటి )



సంపాదకత్వం:

## తెలంగాణా రచయితల సంఘం




దేశోద్ధారక గ్రంథమాల

ప్రచురణము 15.

# మా గురించి

గ్రంథమాల పునరుద్ధరణ తర్వాత ఇది మూడో గ్రంథం. ఈ గ్రంథం వెలువడుటంలోను. సంకలనం చేయడంలోను సంపూర్ణ శ్రద్ధాసక్తి తెలంగాణా రచయితలసంఘమిచ్చింది. వారికి సదా కృతజ్ఞులము. ఈ గ్రంథం ముద్రణ భారమును తీర్చుటలో సాయపడిన సాహితీ మిత్రులకు వందనాలు.

శ్రీ కాళోజీ నారాయణరావు గారి "నా గొడవ" రెండవ ముద్రణ పని ప్రారంభమైంది. త్వరలోనే అదికూడా మీకు అందచేస్తాము.

సదా సారస్వతాభిమానుల సహాయ సానుభూతుల నాకాంక్షించు ....

మీ

10-12-53.
సికింద్రాబాదు.

పట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు.

# దేశోద్ధారక గ్రంథమాల

## విజ్ఞప్తి

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ॥ శే॥ దేశోద్ధారక. విశ్వదాత. కళాప్రపూర్ణ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాలద్వారా లోగా దేశకాలపరిస్థితులనుబట్టి రాజకీయ విజ్ఞానమునిచ్చి, స్వాభిమానమునుపురికొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు ౧౨ గ్రంథములనుప్రచురించి, దేశభక్తులయొక్కయు, మేధావంతుల యొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారత దేశముతోపాటు హైద్రాబాదులో ఏర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాలను నడిపింపజాలలేము ౧౨ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథ ప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. గ్రంథమాల స్థాపనకాలములో మాముందుండిన కర్తవ్యము నేటివరకును తీరలేదని భావిస్తున్నాము.

"మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము." కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని కర్తవ్యములను సూచించునదిగా నుండును. ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వ సహాయాలపైమాత్రమే ఈ మా వ్యవస్థను నిర్వహించగలుగుదుమని విశ్వసిస్తున్నాము. పది రూపాయలకు తక్కువకాని విరాళమును మీనుండి అభ్యర్థిస్తూ, అట్టిమొత్తం మేరకు, వెలువడే గ్రంథాలు అందజేయబడునని మనవి చేస్తున్నాము.

ఇట్లు విన్నవించు

**వట్టికోట ఆళ్వారుస్వామి**
స్థాపకుడు, ప్రకాశకుడు.

సర్వోదయ ప్రెస్,
మహంకాళి వీధి,
సికింద్రాబాదు.

# కర్పూరం

నానా వర్ణ రంజితమైన ఇంద్రధనుస్సులా ఈ కవితా కదంబం తెలంగాణా సాహిత్యాకాశంలో సాక్షాత్కరిస్తున్నది. మహోత్సాహాన్ని విశేష శేముషితో జోడించి గేయాలుగా మలచిన ఈ కవులు నిరాశా నిశి నిశా ముఖాన ఆశా రత్న దీపమాలికలు. ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపులు పాడుతున్నారు. 'వైతాళికులు' నుండి 'ఉదయఘంటలు' దాకా జరిగిన కృషి నిద్రాణ నిస్త్రాణ నిష్ప్రాణ లోకానికి కవితా నవసంజీవనీ గుళికతో మేల్కొల్పడమే.

కవిత్వం సంపూర్ణ పూర్ణిమా చంద్ర బింబం వంటిది; వర్షకాల కాదంబినీ కదంబం వంటిది. దీనివల్ల ఆహ్లాదం, ప్రయోజనం రెండూ వున్నాయి. ఇది లోకానికి ఆనాడూ ఈనాడూ ఉపాదేయం. పంట నూర్పిళ్ల పాట అటు పనిలో ఉత్సాహాన్ని ఇస్తుంది, ఇటు పంటనూర్చే పద్ధతినీ చెబుతుంది. మనకు అందకుండా ఎక్కడో ఉన్నతోన్నతస్థాయిలో వుండే ఆకాశమూ, మన పాదాల క్రింద అణగి మణగి పడివుండే భూమీ — రెండూ మానవుని మనుగడకు సమానావసరాలు. పాఠకుడికి సులభంగా అందే లోతులూ, ఎంత ప్రయత్నించినా అందని ఔన్నత్యాలూ కల కవిత్వం భూమ్యాకాశాల సమాహారంగా చెప్పుకోవచ్చు. మన అనుభూతి అట్టిదే. కవి మనస్సులోని అనుభూతి వివిక్తస్థితిలో తనకు తానై కొన్ని సంకేతాల రూపంలో ఆకారాన్ని ధరించుకుంటుంది. ఈ సంకేతాలు అనుభూతికి చాలా సన్నిహితంగా ప్రతిబింబమాత్రంగా వుంటాయి. అనువైన శబ్దాల పేరిక, చక్కని గమనమూ, ఉదాత్తమైన చిత్రణాశక్తి నిసర్గమైన నుడికారాలూ కూర్చి వుంచే ఈ ప్రతిబింబాలు అసలు బింబంమాదిరే

మనకు సాక్షాత్కరించి, బింబ ప్రతిబింబ భావం మనలోనుండి తొలగి పోయి కవి మనస్సులోని అనుభూతి సుస్పష్టంగా మనకు అందుతుంది. అందుకే ఉదాత్తమైన భావనకుతోడు అనంతమైన శేముషీ కావాలి. శేముషి కొరవడినప్పుడు కవిత్వంలో సగానికి సగం ఆకర్షణ సన్నగిల్లిపోయి పాఠకుణ్ణి ఆకర్షించదు.

ఇందులోని కవులు ఈ నాటి లోకం పోకడను సూక్ష్మదర్శినితో పరిశీలించి ఈ దారిలో ప్రమాదం వుందని హెచ్చరిస్తున్నారు. వర్తమాన యుగంలోని సామాజిక స్థితి ఎంత దుర్భరంగా వుందో నొక్కి వక్కాణిస్తున్నారు. భవిష్యత్తు శాంతి చంద్రికాదిగ్ధం కావాలని కృషిచేస్తున్నారు. వీరి కవితా ఘంటా నిస్వనాలు నిద్రాముద్రితప్రజకు మేల్కొల్పులుగాక మరేమిటి! తరతరాల విస్మృతిని వదలగొట్టే అగ్ని వీటి శబ్దాల్లో వుంది. ఇవి చాలా సక్రొత్తగా మ్రోగుతున్నాయి. ఇవి వినకొల్లనివాణ్ణిసైతం చెవులుపిండి వినిపిస్తున్నాయి. ఇవి వింటున్నప్పుడు హృదయం ఒక్కసారిగా ఆరోగ్యస్నాతమైనట్టు తేలికగా వుంటుంది. మానవుని వెన్నంటి గిజిగాని గూటివలె పెనవేసుకొని వున్న ఎన్నోసమస్యలు ఇట్టే పరిష్కృతమై, మన ముందు నిటారుగా నిలుచునివున్న తమఃకుడ్యాలు తునాతునలై కూలిపోయి సువిశాల తేజోమార్గం సముజ్జ్వల భవిష్యము చలనచిత్రంలోవలె కను మేరలో కనుపిస్తున్నట్టు అనిపిస్తుంది. ఆశలు మొత్తానికి మొత్తం పండి కష్టాలు గట్టెక్కినట్లుగా తోస్తుంది. మానవుణ్ణి ఆశాగరుడారూఢుల్ని చేసి కాంతి లోకానికి ఎత్తుకుపోగల శక్తి ఈ కవుల పలుకులకు వుంది. ఈ గంటలకు రెక్కలుంటాయి కాబోలు! గంటలకు రెక్కలు!

ఇందులో ఇదివరకే పేరు, ప్రతిష్ఠలు ఆర్జించుకొనిన మహా కవులున్నారు. నూతనంగా కావ్య కల్పనానికి కడంగిననారూ వున్నారు. సరదాకు సముద్రయానం చేయబోయిన నావికులు తిరిగి వస్తూ అమూల్య

రత్నరాసుల్ని ఆశ్చర్యకరంగా వెంటతెచ్చినట్లు ఈ యువకులు ఉబలాటంతో కలంపట్టి రేపు మహాకావ్యాలు రాస్తారు. తెలంగాణా రచయితల సంఘం ఇదే ఆశిస్తుంది.

ప్రత్యేక ఆదర్శాలను ప్రచారంచేయడానికి కవిత్వం ఉపయోగపడు తుందనే వాదం ఉన్నది. కొన్ని రాజకీయ సిద్ధాంతాల అభివ్యాప్తికి దీన్ని ఉపయోగించుకోవాలనుకోవడంకూడా కద్దు. అయితే కొన్ని సత్యాల్ని చెప్పినప్పుడు కవికి రాజకీయాల ముసుగు ముఖాన యుద్ధానికి ప్రయత్నించేవాడా వుంటాడు లోకంలో. అట్టివారిని తొలగద్రోచి వెళ్లిపోవాలి కవి. ఇరవయ్యో శతాబ్ది సగం ముగిసినా ఇంకా మన దగ్గరనే ఉన్నా. మారుదూరానా పలసరాజ్యాలూ, పరాయి పెత్తనాలూ, ప్రజాసత్తాక రాజ్యాల్ని సేనాబలంతో ఇట్టే తొలగించివేయడం, ఇంకా అక్కడక్కడా, ఇక్కడిక్కడా రాజులూ, రాచగద్దెలూ కనిపించకుండా పోలేదు. తుపాకీ మందు దినుగొంటబడిన్నాడే మరణశయ్యనెక్కిన జమీందారీ విధానం ఇంకా ప్రాణం వదలకుండా మరికొన్నాళ్లు కొనఊపిరితోనైనా బ్రతకాలనే ఆశతో మూల్గుతూ, మిన్కుటూ కర్షకజనాన్ని విసిగిస్తూనేవున్నది. వేరే దేశాల వ్యాపారులు ఇప్పుడిప్పుడే స్వతంత్రమైన పసిదేశాల వ్యాపారరంగాన్ని విజయవంతంగా హస్తగతం చేసుకోగలుగుతున్నాయి.

ప్రజాస్వామ్య ప్రభుత్వాలు చాలా కష్టంగా తమనుతాము నిలద్రొక్కు కుంటున్నాయి. మారణాయుధాల జోరు మరీ హెచ్చింది. క్షణంపాటులో లోకం పిడికెడు బూడిదగా రాలిపోతుందా అనే భయం ప్రతివాడికీ కలుగు తోంది—ఈ బాంబులమాట ఏంచెప్తే. ఇక విషక్రిములు ఎటుచూచినా లోలెడు. అడిగినవాడికల్లా సోలెడు. ఈ స్థితిలో ప్రణయగీతం పాడలేం గానీ ఆ మార్గాన కొంత మానసికోల్లాసం పొందడానికి వీలువుంది. అలా

రాసినవాళ్లూ లేకపోలేదు ఈ కదంబంలో. అయితే ఇందులో ఎవరూ ఏ జండాలూ ఎగరేసినట్టు కనపడదు. కైదండలనెత్తి సరాసరి నిశ్చింతగా ప్రయాణం చేసే మనకు ఏ జండా అండ ఎందుకు? రాగ బంధంలో యావజ్జగత్తును కట్టివేయగలం. అప్పుడు అంతా కలిసి కట్టుగా శాంతిని సాధించుకోనూ గలం.

కీర్తికిరణ రుచిమంతమైన సుప్రభాత సమయాన ఆశాపక్షించలాల్సి కదిలిస్తూ ఘంటలు మనదాకా వస్తున్నాయి. ఇదిగిదిగో ఉదయ ఘంటలు, ఇదిగిదిగో హృదయ ఘంటలు.

5—12—53

సంపాదకులు

**తెలంగాణా రచయితల సంఘం**

హైదరాబాదు.

# అగ్నివీణ

---

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు.



అగ్నివీణ అదిరి పడిన
        అపరాహ్ణము లోకానికి,
నగ్నరౌద్ర రాగిణీ గణ
        నర్తన సంవర్తఘటిక
లోకానికి—నీకు, నాకు—
        ఏకాకిని కవనానికి।

ఏ కరాళ హాలాహల
        భీకర తృష్ణాతంత్రిక
లో కదలిన ఘూకశ్రుతి
        లోక మావరించినదో?...

అగ్నివీణ అమరాపగ
        స్నిగ్ధలహరిలో రక్తిమ,
అగ్నివీణ దిగ్దిగంత
        దగ్ధాతప దవారుణిమ,
అగ్నివీణ అఖిల భువన
        కృధాక్షుభిత రణారుణిమ,

## 2

క్షుధాతృషిత వ్యధాతపిత
నిదాఘదిన హృత్ శోణిమ!!

అగ్నివీణ అసిధారా
ధగ ద్ధగిత భయదకాంతి!
యుగభ్రమణ జగత్త్రాంతి!
వసుంధరా వ్రణ నిర్గత
అస్రసిక్త విషమతంత్రి!
అగ్నివీణ గ్రీష్మ లగ్న
మృత్యుమగ్న మృషాశాంతి!

అగ్నివీణ వికల హృదయ
వికృత విలయ విధురశ్రుతి!
మధుర కవన రుధిర ప్లుతి!
మృదుల కుసుమ మరణస్మృతి!
ఝణంఝణిత రణన్నినద
కిరణతంత్రి! మరణ జంత్రి!

పొరపాటున తెరదాటిన
పరమాణువు పలికించిన
అగ్నివీణ భుగ్నతాన
నగ్నగాన ముదిరిపడిన
అపరాహ్ణము లోకానికి!
లోకానికి—నీకు, నాకు—
ఏకాకిని కవనానికి!



# ఓ భ్రమరీ!!



పుట్టపర్తి.



ఏమిపాట పాడెదవే।
యెవరి మనసు కదిపెదవే।
అంబుజ శుద్ధాంతచరీ।
ఓ భ్రమరీ।
నాదఝరీ।।

గతచరిత్ర తడవి తడవి
మృతులై పోయిన రాజుల
ప్రణయగాథలల్లెదవో।
ఓ భ్రమరీ।
నాదఝరీ।।

ప్రాణతర్పణమ్మొనర్చి
రణలక్ష్మికి తోడవులైన
వీరులనుడి చల్లెదవో।।
ఓ భ్రమరీ।
నాదఝరీ।।

## 4

కనులనీరు—చనులపాలు
పనచే తమ జీవితమగు
వనితలహృది పలికెదవో!
ఓ భ్రమరీ!
నాదఝరీ!!

తమజీవిత స్మశానమున
ధనికుల మేడలవెలుగై
దగ్ధమైన బ్రదుకులెంతు
వో! భ్రమరీ!
నాదఝరీ!!

కడుపుగాలు బీదల కథ
గండ్లే సీగానమైన
గట్టిగ పాడేవుసుమా!!
ఓ భ్రమరీ!
నాదఝరీ!!

---

## ఇ ఖి లా బ్

---

**పురిపండా అప్పలస్వామి**



రెండు పక్కలా వెలిగించాను
కొవ్వొత్తి
శ్రీశ్రీ లా వెలుగుతోంది.

నాకూ నా నీడకీ నడుమ
నలభై కోట్ల కంకాళాల కంకాళాలు
నిద్రపోతూన్న నగరంమీద
కంబళీమూత నల్లపుందు చీకటి
కంకాళాల కనుకుటకలు
కాలాంతాల గహ్వారాలు
వీపున మొలిచిన కళ్లు
భూతకాలం వెదుకుతున్నాయి.

బురదలో పడి
ఆత్మహత్య చెసుకోలేక
పురుడు పేడు చెప్పి
మూలుగుతూన్నది సంఘం.

మట్టి ముద్దలతో కట్టిన
కోటగోడల పగుళ్ల నించి
నగ్నదృశ్యాలు ఎలుగుగొడ్లు
అసిరమ్మల తొలిసమర్త
గుళ్లోనే కావాలని
గుడిచేటిక సందేశం
నా మస్తిష్కం పైకితీసి చదువుకున్నాను.

ఒకటే జ్వాలా కావ్యం.
ఇన్‌ఖిలాబ్ జిందాబాద్
ఒకటే జ్వాలా గేయం
ఇన్‌ఖిలాబ్ జిందాబాద్

ఒకటే జ్వాలా రాగం
ఇంక్విలాబ్
ఇంక్విలాబ్
ఇంక్విలాబ్
జిందాబాద్.

# కోలాహలం

## విశ్వం



కలత జెందిన మనసులో నొక
విలయ కోలాహలము పుట్టెను
తలపు గాలిదుమారమున కం
పిలెను గుండియ మొండి కుసుమము.

నిలయ మెరుగక నీడచిక్కక
పలుకరించే దిక్కు గానక
జలదరించే కనుల వెలుగుల
నాలుకు కోరికలుమిసె గరళము.

కాలిపోయిన కొంప జిక్కిన
గాలిబొమ్మకు పాలుబోయగ

# 7

జాలిగొని జవరాలు పాపం
కాలి నడకను బయలుదేరెను.

నాలుకెండిన నాగుమయ్యకు
పాలుపూలిక ప్రకోపించెను,
ధూళిదొరలిన దొండపండును
మూలకాకెత్తుకొనిపోయెను.

లాలమీ మాలిమీ లేనీ
కాలనేమికి శోష వచ్చెను,
పూలరాసిని కదిపినంతను
కాలసర్పము పడగవిప్పెను.

నాల్గు నాళ్ళ జ్వరాగ్ని పిల్చిన
నరాలల్లో వాపు పుట్టెను.

కడుపులుబ్బిన జ్వరంబిల్లను
పడకబట్టిన తేలుకుట్టెను.

వండవలసిన కుండలో నవ
ఖండధాన్యాల్ నిండుకొనియెను.

గండుకోళీ కుడితికుండను
పండుకొనియెను పాపభీతి ?

చండశాసన సూత్రపంక్తికి
కుండలిని వ్యాఖ్యలను వ్రాసెను.

8

మొండి బ్రతుకున కండలేనీ
ఎండిపోయిన ఎముకవిఱిగెను.

కలత జెందిన మనసులో నొక
విలయ కోలాహలము పుట్టెను.

---

# బరువు బండి!

---

పి. గణపతిశాస్త్రి



ఎద్దైనా మోయలేని పెద్ద బరువు బండి, మిట్ట
మధ్యాహ్నం తారురోడ్డు మంటల్లో ఈడ్చే, ఓ
అన్నా నీ పై ఒక చిన్న పాట రాస్తే ఇక
అరుగుమీద కూర్చుని విని ఆనందిస్తుంది లోక
మన్నన్నా! ఈ పాపం మన్నిస్తావా? ఇంకా!

ప్రతిక్షణందిగ లాగే గతుకుల్లోపడి, అతుకుల
బతుకు బండి లాగి, లాగి, చితికి తూలిపోతూంటే—
అన్నా! నీ పై ఒక చిన్న పాట రాస్తానొక
అరుగుమీద కూర్చుని విని ఆనందిస్తుంది లోక
అన్నా! ఈ అపచారం మన్నిస్తావా? ఇంకా!

## 9

విన్నావా ! ఈ చిత్రం ! నిన్నుగూర్చి రాస్తేనట !
పిన్న పెద్ద కవులల్లో పేరు మోగిపోతుందిట !
అన్నా ! అయింది ! ఏదో ! చిన్న పాట రాశానొక
అరుగుమీద కూర్చుని విని ఆనందించింది లోక
మెన్నటికీ ఈ మోసం మన్నించవులే ! మరింక !

---

# కాలిబాట

పొట్లపల్లి రామారావు



అదిగదిగో కాలి బాట
అందాల కాలి బాట
ఎటనుండో, ఎటనుండో
ఎ సుదూర స్థలమునుండో
నిలుకడ నిద్దుర లేని
నీరువోలె ప్రవహిస్తు
గమ్యము గృహములేని
గాలివోలె విహరిస్తు
స్వేచ్ఛా జీవనవర్తిని
స్వచ్ఛముగా వెలుగుతుభువి

# 10

నవతరించి వస్తున్నది
నాదరింప వస్తున్నది

ఏభూమిని పుట్టిందో
ఎటుల చెప్పగలము మనము
ఏ సీమకు పోతుందో
ఎవరు చెప్పగలరు నిజము
మంచిరాల పోతుందో!
మానుకోట పోతుందో
లండన్‌కె పోతుందో
లాసాకె పోతుందో
ఈరాకొ, మొరాకొ
ఈజిప్టొ, సిరియాకొ,
ఎక్కడికొ, ఎక్కడికొ
ఎవరెరుగని ఏభూమికొ
పాదమేసి, పాదమెకద
పల్లైతేం, ఢిల్లైతేం

అడవిచూచి హడలిపోదు
ఆత్మ ఎంతదొ కాని
గుట్టచూచి కృంగిపోదు
గుండె ఎంతదొ కాని
నీరుచూచి నిలచిపోదు

నిష్ఠ ఎంతయొ కాని
మిట్టలు, పల్లాలురాని
చెట్టులు, పుట్టలురాని
మండె ఎడారులురాని
మంచు దిబ్బలెరాని
కందకాలు అడ్డురాని
కంటకాలు అడ్డుపోని
ఆగిపోదు కాలిబాట
సాగిపోవు కాలిబాట

రోడ్డుముందు కాలిదాట
గడ్డిపోచవలె తోచును
రైలుముందు కాలిదాట
లక్ష్యపెట్టరెవరు నిజమె
విమానయానం ముందర
విలువసలే లేదుకాని
గద్దుతో(?)వ లెదురొచ్చి
రోడ్డు కాళ్లు చాచుచోట
కొండవాళ్ల చూచిరైలు
గుండె లాగిపోవుచోట
వాయువిమానం ఊపిరి
తీయలేక కూలుచోట,
ఒంటరిగా, ఓరిమిగా

ఒకొక అడుగే భారంగా
సాగిపోవు కాలిబాట
సాగిపోవు పూలబాట

టిక్కట్టు లేకుండా
డిల్లీకి పోవచ్చును
పాస్‌పోర్టు లేకుండా
మాస్కోకు పోవచ్చును
సెంటు చేతలేకున్నా
షికాగో పోవచ్చును.
కలకత్తా పోవచ్చును
కాకినాడ వెళ్లొచ్చును
ఎముకలోన బలముంటె
ఎవరెస్టు ఎక్కొచ్చును
సీజనుటిక్కట్టు లేక
సృష్టియంత తిరుగొచ్చును
యిక్కట్టొక టోర్చుకున్న
చక్కగ పయనము సాగును
కాలిబాట, కాలిబాట
.... .... .... .... ....

పిటీషన్ల, పిర్యాదుల
పేచి లసలే ఉండవు
ఎస్టిమేట్ల కంట్రాక్టుల

యిబ్బందులు లేనేలేవు,
మరామతుల, మంజూరుల
మాటలనలె వినరావు
గ్యాంగుమెన్ల, ఒవరుసీర్ల
గడబిడలె ఉండవసలు
నేలబొగ్గు రోలర్లు
నీళ్లుచల్లు మోటార్లు
ఘనముగ విమానముపై
గవర్నరొచ్చి తెరవవలయు
కార్యభారమేముండదు
కాళ్లకు చెప్పులులేని
గంటికి, గుడ్డకులేని
కడుపేదల నడకచాలు
సాగిపోవు కాలిబాట
సాగిపోవు పూలబాట

విప్లవకారులు దీనిని
విచ్ఛేదము చేయలేరు
యుద్ధాలెప్పుడు దీనిని
హద్దులోన పెట్టలేవు
ప్రళయాలొచ్చినగాని
బాటరూపు మాసిపోదు
దేశగతులు మారినను

లేశముతాచెక్కుచెదదు
స్వేచ్ఛాజీవన ప్రియుల
యిచ్ఛతోడ జన్మించిన
కాలిబాట నాపినట్టి
ఘనుడుకానరాడు భువిని
కాలిబాట, కాలిబాట
కలకాలము వర్ధిలుమిట

ఋజుమార్గమె కాలిబాట
నిజజీవన పథముచూడ
రాజుగారి కోట ఉన్న
లక్ష్యపెట్ట దిసుమంతయు
రాణిగారి తోట ఉన్న
రవ్వంతయు తొలగిపోదు
క్లబ్బుఉన్నా, ఉర్సుఉన్నా
కాలేజి గ్రౌండుఉన్నా
బాపటిస్టు చర్చిఉన్నా
బ్రిహ్మాజెముడు కంపున్నా
కంచెఉన్న, పొలమున్నా
కాలిబాట వేదంచు
కలుకు సైనుబోర్డున్నా
ఆగిపోదు కాలిబాట
సాగిపోవు కాలిబాట

## 15

కాలిబాట లేనిచోటు
కనభూమిని కనిపించదు
ఉత్తర దక్షిణ ధ్రువాలు
ఉరల్ పర్వతశ్రేణులు
పట్టణాలు, జనపదాలు
పంటచేలు, ఫ్యాక్టరీలు
అంతట తానై యుండును.

అంతరంగ హితునిమాడ్కి
అన్నిదిశల తానున్న
అల్లి బిల్లిగానున్న
దేశపటము వెతికిచూడ
దిఙ్మాత్రము కనిపించదు
గడ్డివాళ్లు గాజులోళ్లు
కొర్టు ప్యూన్లు, పోస్టుమ్యాన్లు
కూలివాళ్లు, పాలవాళ్లు
పాకివాళ్లు, చాకలోళ్లు
పయనించె కాలిబాట
పరుతెంచె ధూళిబాట

మ్యాపుపైన ఉంటుందా!
మర్యాదల గంటుందా!
పేదలు సాదలు, దేశపు
పెద్దల హృదినుంటారా?

కాలిబాట, కాలిబాట
కలకాలము వర్ధిలుమిట.

---

# సామాన్యుని కామన

---

**శ్రీ శ్రీ**



## ౧. సామాన్యుని వాస్తవికత :

ఈ రోజున సామాన్యుడు
ఏమీ లేనట్టి వాడు
కూడూ గూడూ గుడ్డా
ఏవీ లేనట్టివాడు
చదువూ సామూ శాస్త్రం
ఏవీ ఎరుగనివాడు
ఈ రోజున సామాన్యుడు
సగం దేవతాంశ, సగం
మానవాంశ, సగటున ఈ
సామాన్యుడు మానవుడు
అంటే నీవూ నేనూ
ఆమె ఈమె వీడూ వాడూ

అంతా సామాన్యులమే
సగం వెలుగు సగం నీడ
సగం ఋతం సగమనృతం
సగం ఆడ సగం ఈడ
సగం పశువు సగం నిసువు
ఈ వెల్తురు ఈ చీకటి
ఈ యిరులూ ఈ వెలుగూ
వేరువేరు గదులు కావు
ఒకటే రెండూకూడా
ఇపుడునిప్పు ఇపుడుపువ్వు
ఇప్పుడు దూసిన ఖడ్గం
ఇంటట్లో కౌగిలింత
ఒకనేత్రం కల్హారం
మరోకన్ను కర్పూరం
మూడోకన్ను వాడంటూ
లేదంటే నమ్ముతావ్
చూడవోయ్ నీలోకినీవు
ఒకటి రెండు పెరసిమూడు
నరకం స్వర్గం అన్నవి
ఒక స్థితికే రెండుపేర్లు
ఫోకస్ భేదం అంతే
లోకస్ రెండింటికొకటే
శ్రీ అనగా లక్ష్మిసరే
శ్రీ అంటే విషంకూడ
శ్రీ శ్రీ సిరి చేదు. లేక

సిరీ సిరీ, చేదు చేదు
మీ యిష్టం శ్రీ కారం
గుణకారం చేసుకోండి
మీకే అర్థం తోస్తే
ఆ Key నే వాడుకోండి
ఒకచే శ్రీ అదే రెండు
ఆదే చేదు సిరీ అదే
అమరత్వం అమరత్వం
శ్రీ శ్రీ ఒక మానవుడు.

౨ నేపథ్యంలో :

నీ మూసిన పిడికిటిలో
ఏమున్నది కవీ కవీ
ఆ దాచిన పళ్లెంలో
ఏంతెచ్చావ్ సుకవీ
ఆమూలని సంచిలో
ఏమున్నది కవీకవీ
నీ మూసిన గుండెల్లో
ఏందాచావ్ సుకవీ
నీపాడని పాటల్లో
రాపాడెది కవీ
ఆ కొసలో నీడలలో
ఏసత్యం సుకవీ
ఏ సత్యం ఏ స్వప్నం

ఏ స్వర్గం సుకవీ
మాకోసం నీ కోసిన
వే కాన్కల పూలు కవీ.

## ౩. సామాన్యుని కామన :

సైన్సువల్ల ఈ రోజున
సామాన్యుని బతుకుకూడ
సౌందర్యమయం కాగల
సదుపాయం లభించింది
జన్మం చర్మం వెనుకటి
సంప్రదాయమూ ఇప్పటి
సంఘ స్థితులూ నెరపే
అసమానత పనికిరాదు
ఐశ్వర్యం అందరిదీ
అందుచేత అందులోన
సామాన్యుడు తనవాటా
తనకిమ్మని కోరుతాడు
బతకడమే సమస్యగా
పరిణమింప జేసినట్టి
అన్యాయాలన్నిటినీ
హతమార్చాలంటాడు.
ఇదేంపెద్ద గగనమా ? మ
రిదేం గొప్ప కోరికా ? ఇ
కేం ? ఇదొక్క విప్లవమా ?

# 20

ప్రశ్నిస్తే పాపమా ?
యుగసంధిది, సామాన్యుని
శకం దీన్ని కాదన రా
దిది రేపొచ్చే వ్యవస్థ
కివాళనించీ పునాది
ఇప్పటినుంచీ నాంది.
అంతే ఇంతే స్వప్నం
అన్నీ ఒక్కడికి బదులు
అంతమందికీ అన్నీ
అదే స్వర్గమంటాను.
ఆ స్వర్గం వేరే కడు
దూరంలో లేదు లేమ
ఈడే నేడే వున్నది
నీలో నాలో ఉన్నది
మీ యిష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు స్వర్గంగా
చీల్చవచ్చు నరకంగా
ఏంచేస్తారో సరి మరి
ఇక మీ యిష్టం.



# వేదాంతం



సి. వి. కృష్ణరావు

నాకు కట్టుకున్న గుడ్డకన్న కంతలు మిక్కుటమైనపంచె—
సమాజ సమాధిలో పురిటి వ్యూహాల పెంపుదలలు ;
కవితకు దానిసనై కలవరపడుతూ బ్రతుకునేను.
మోకాళ్ల చినుగు ఒంటరి లాగుతో
మధురగీత లాలాపన చేయలేను :
భూతవర్తమానకాలాల బూదిద్దైన స్వతంత్రం
భవిష్యత్తున నిర్మిస్తూ పొడిగిస్తా భద్రంగా :
చిరిగిన జేబువెతికే గుప్పిటతో
విశ్వాంబయటి వ్యూహాలతో విహరించలేను :
ఒక్కడనై బ్రతికేందుకు వేశ్యలు దొరకరునేడు.
వేశ్యలం మేమందరం వైశ్యవిధానపు వికృతికి.

బజార్న నడిచే నాముఖంమీద దాటరీవేసి
ముఖం ఎందుకువెత్తావ్ ? మోవి ఎందుకు విప్పావ్ ?
మంచివాడవైతే నావేపెందుకు చూశావ్ ?
అంటున్నది చీకటిబేరపు సారం.

లక్షల భిక్షుకుల లక్ష్యం చేయక
ప్రాణంకై పగిలిన మానవు కొలమానమ్ములు పాటింపక

నెలజీతంచాలక నిజ భార్యలనిజాలను మజాలుచేసే
భర్తల సంఖ్యలు తెలియక
పట్టభద్రులై పలు యిక్కట్లకు లోనై
పస్తులున్న పక్షుల బారుల లక్షలు తెలియక
గంజిపెట్టిన చొక్కాల వెనుక
గర్జించే ప్రేవుల ఘోషలు వినపడక
కూడు లేక చచ్చే కురూపులెవరూ లేరని
కొందరు వాక్రుచ్చిరి.
వధ్యశిలపై ఎక్కినా
'మాతా మే వంధ్యా'
అనవక్రోక్తి విడువరు.

ఒకడనె నేనై
నా వేదన ప్రణయానికో
తిరస్కృతికో
పలకరానికో
ఏ కొంచపుదానికో
ఏ భావి పునాదికో
అయితే
కష్టపడి వినేదెవరు ?
కన్నెత్తిచూసేదెవరు ?
కోటాను కోట్లు
నా వేదన తమ వేదనగా
స్పష్టపరచి
ప్రళయానికీ

## 23

ప్రపంచానికీ
పలు కష్టాలకీ
మూర్తీభవింప జేశారు.
పగలు రేయి పాటుపడ్డా
పదసౌరభం పొసగదు.
పాటిమట్టి మిట్టన
బంగారు పళ్లెం దొరకదు.

స్వచ్ఛంద కళల్ని
సృష్టించలేదు
స్వీయం అన్నది సర్వత్రా
సంధించుక వున్నది.

విశ్వం బయట వూహిస్తేనే
వేదాంతమన్న మీరు
వెర్రాకలితో వెలిగెత్తితే
ఎలా నన్ను ఎంచగలరు
ఎత్తైన వూహాలు గలవాణ్ణని ?



# కొత్త పెళ్లి

పన్యాల రంగనాథరావు



రండర్రా రండి, అంతా రండి!
ఎండిన మొక్కలు చిగురిస్తున్నాయి చూడండి!
పండుటాకు లెప్పుడో రాలిపోయాయిలెండి.
బొక్కినమ్మకు దక్కిన బియ్యంలా
ఎక్కడికక్కడికే, ఇక్కడిదిక్కడికే
చేసుకున్నమ్మకు చేసుకున్నంతే మరి!
అపరాహ్ణంలో మళ్లీ
ముహూర్తం మించిపోతుంది
ఎంతో కొంత దీవించండి—మీకు
చాతనైనంతే చాలును లెండి.
అందాల పోటీలో గెలుపుకి
అర్ధ నగ్న యోగ్యతాపత్రం పొందింది
ఈ పెళ్లికూతు రిప్పటి కింతే
ఎప్పుడెలా ఉండే ఎవరికొక్కవాలి?
చీరా రవికా తొలగించారు
సింగారించారు ఈత వలువ
ముక్కందం చెడుతుందని

ముక్కు పుడక కత్తిరించి
ప్రధాన పుంగరం కాదది
సంధానపుంగరంలో పొదిగారు
సన్నాయి మేళం వద్దు
ఉన్న రేడియో తిప్పుకుంటే చాల్ను.
మంత్రాల తంతేదీ కాదు. నాలుగు
ప్రేమ గీతాలు దంచవే పిల్లా !
ఈ మధ్య సినిమాల నేపధ్యాలే కొల్ల.
పెళ్లికొడుకు గుడారంలో
ఫైరిగింది పెద్ద రభస
పెద్దలు కచ్చలు బిగించి
పెడుతున్నారు పోటీలు
ఈడుతో నిమిత్తం లేదని
ఇల్లెగర గొగుతున్నారు
కాయ కల్పం గాళ్లమని
గగ్గోలు, పెడుతున్నారు
ఎవడో, వస్తాడు ముందుకి
రాకేం చేస్తాడు చివరకి ?
ఎగరేసుకు పోతాడా ముంతా
నోరు తెరచి చూస్తారంతా !
ఎటొచ్చీ పోటీదార్లు
పటపట లాడిస్తారు పళ్లు
అవకాశాల కేం కొదవ ? ఎప్పుడో
అటునుంచి లేవ దీసుకుపోతాడప్పుడే
అక్కడే కాసిన ప్రథమ హతాళుడు

అన్నంత పనీ చేస్తాడు చూడుడు:
చస్తున్నవాళ్లు చస్తూనే ఉంటారు
పుడుతున్నవాళ్లు పుడుతూనే ఉంటారు.
ప్రపంచం పరిభ్రమిస్తూనే ఉంటుంది
అటు సూర్యుడి కిటు రావడమే పని మరి.
అంతా బాగానే ఉంటుంది
అర్ధ నగ్నవతి చేతుల పూర్పులో
కొత్తకొత్త రకాల రూపాలే
పొందుతుంది. చిందుతుంది అందాలు.

## పోటీ తెన్నులు

కాళోజీ నారాయణరావు



చాపచింపు—సామ్రాజ్యం
కోడి గ్రుడ్డు—కోహినూరు
పాటి మన్ను—ప్లాటీనం
బస్సు సీటు—బ్రహ్మరథం
ఏదైతేం—ఏదైతేం ?
పోటీ పడి కాటులాడ.
అడవిమనిషి—ఆచార్యుడు

పసి బాలుడు—పండు ముసలి
బిచ్చగాడు—లచ్చి మొగడు
తొత్తుకొడుకు—పెత్తనదార్
ఎవరైతేం—ఎవరైతేం ?
పోటీపడి కాటులాడ.
తండ్రి, కొడుకు—తల్లి, బిడ్డ
అన్న, తమ్ము—డక్క, చెల్లె
బావ, మరది—భార్య, భర్త
ఇరుగు, పొరుగు ఎరుగనోరు
ఎవరైతేం—ఎవరైతేం ?
పోటీపడి కాటులాడ.
విపణివీధి—తపోవనం
చాకిరేవు—శాసన సభ
సానికొంప—సాధు మఠం
మూత్రశాల—యాత్రాస్థలి
ఎపుడైతేం—ఎచటైతేం ?
పోటీపడి కాటులాడ.



# ఒక్కా ఓ చెలియా!

ఆరుద్ర



బేడీలుపడ్డ చెయ్యి ఏం రాస్తుంది ?
పేదివాళ్లకి సాహసం ఎలావస్తుంది ?
నవలూ బానిసలూ సంఘటితం కాలేరు.
అసలు అజ్ఞానులెన్నడూ తిరుగబడలేరు.
వినం వినం వినం వినంగాక వినం అనే
సీసం బిరడాలు తాపడం కాబడ్డ
చెవులముందెందుకీ విమల గాంధర్వం ?
ధనం ధనం ధనం ధనం తప్ప వేరేదీ
ఘనం కాదు కాదు కానే కాదనే
గాజు కళ్లముందెందుకీ రసమయ కళాఖండం ?

తరణోపాయంలేదు తమ్ముడూ - జీవించి లాభం లేదు
మరణించడానికికూడా మార్గంలేదు - మరోదారి లేనేలేదు
అరుణోదయం అయ్యేదాకా ఆశలుంటాయో లేదో చెప్పు
కరుణలేని లోకంలో కడుపు నిండుతుందనుకోవడంతప్పు
అయోమయమైన వర్ణచిత్రంలాగ అలుక్కుపోయింది భవిష్యత్తు
క్రియాశూన్య పదకాల కిలుంపాత్రల నీరుచే కలిగె మత్తు.

ఆ ఇ ఉణ్ ఋ ఌక్
అందమే హూ త ఛుక్
క ఖ గ ఘ ఙ
బావుకి అనుజ్ఞ
ఆ ఇ ఉణ్ ఋ ఌక్
ఆశే మన శుక్ర—
అందమైన బ్ర—
కొంత మెతుకుతో
నిండుతుంది స్మీ
కడుపునిండు మె—
కొంత బ్రతుకులో
దొరుకుతుందిలే.

---

# ఏ గంట?

కొనకళ్ల వెంకటరత్నం



( బంగారిమామ పాటలనుండి )

ఏ గంటకు రమ్మంటవె కన్నెలేడి ? ను
వ్వేడ కాచుకోనుంటవె వన్నెలాడి ?
పుగతోటకు నీళ్లుపెట్టి.

బుగతగారి నేమరించి,
కోరుకొన్న మొగలి పొత్తి
కొండ కోన వెతికితెచ్చి,
అలసట తీరే తలికే
అద్దరేత్తి రవుతాది—
ఏ గంటకు....

చీకట్లో నీ అందము
చిక్కి విడదు నా కంటికి ;
వెన్నెలలో నీ అందము
కన్ను చెదరగొడ్తాది ;
చీకటి వెలుగుల సందున
చేరరావె చిన్నారీ !
ఏ గంటకు....

మోటు సరుకు తోట గాలి
కాచేస్తే కసిరి కసిరి,
నిమ్మతోట పరువానికి
నిలవలేక నిలవలేక,
నలుగుదుపడి వస్తే ను
వ్వలిగిరాకు - ఆగిపోకు—
ఏ గంటకు....

చిలిపితనానికి పేరు
చెల్లెమ్మకు దొరికేవు,

గుంటల కోనేటిమీద
గొబ్బెమ్మలు నిలిపింది
అడుగుపడిందంటె చాలు
ఆనవాలు పట్టేస్తది—
ఏ గంటకు....

సోగకనులు పట్టలేను
తీగమల్లె కడవొద్దు ;
కలిసిపోవు నీ బుగ్గలు
గులాబంట్ల వెనకొద్దు ;
పూలపొంత పొదలచెంత
పొంచుని నను వంచింపకు—
ఏ గంటకు....

పొడుపు కతల తమ్మయ్యకు
పొద్దోయిందని వూచి
వూసులాడు నేస్తాలకు
'వూ'కొట్లతొ సరిపెట్టి
కునికే చుక్కల వెలుగున
గుట్టుచప్పుడుగ రావలె—
ఏ గంటకు....



# మస్తిష్కంలో లేబొరేటరీ



శ్రీ దాశరథి

మొహంజొదారో శిథిలాల లోతులలోకి—
శతాబ్దాల మట్టి పొరలక్రింద బొగ్గైపోయిన పురాతన
నాగరికతా గర్భంలోకి—
సూర్యుడు అస్తమించిన జాడల్లోకి వొకదారి;
మరోదారి
మస్తిష్కంలోని మాయింటికి.
మా యింటి వెనుకగా—
తాజమహల్ అందాల్లో మెరసిన షాజహాన్ కీర్తి;
అ ఇ ఉణ్ణులతో
ఋలుక్కులతో కట్టిన వైయాకరణి సమాధి;
లోకాన్ని అడక్కుండా ఎవడో దుష్ట నృపతి రచియించిన
కఠిన శాసనాల రాసులు—
మరి మాయింటి ముందుగా—లేబొరేటరీ
బేడాకు దొరికే నా పెన్సిల్ ముక్కలో—
జగత్తుకు ప్రాణం ప్రసాదించిన కార్బన్ పరమాణువు;
అందులో సెంట్రల్ న్యూక్లియస్ చుట్టూ చాంద్రాయణం చేసే ఆరు
ఎలక్ట్రానులు—

సూర్య తేజోరాశిచుట్టూ శనీ గురువూ మరోడు మరోడు
వాళ్ళవెంట భూమి తల్లి ప్రదక్షిణం చేసినట్లు.

మరి ఆనాటి పాతగంటం కంటిలో—
రాక్షసీ వికటాట్ట హాసం,
రంభోర్వశీ నాకవాసం,
రాజుల పాదాల క్రిందుగా పరచిన
రైతుల రతనాల బ్రతుకుల తివాసీలు
పాతకాలం పసిడి రంగుల బరువు లోర్చిన
పట్నవాసపు మ్యూజియంలో—
పసందైన శ్యామాకమలాల మెత్తదనం వొత్తుకున్న చిత్తరువులు
శిలా విగ్రహాల సీత్కారం
అలంకారాల బలాత్కారం.

మరి నాలో లోపలి చిత్రశాలలో
చిత్రించరాని
శిల్పింకూర్చలేని వేదన
చితికిన ఆటం వంటి బతుకులో ప్రణయం కదాచిత్ ;
శిశిరంలో గుడ్డలూడిన,
రహస్యాలు లేని, దెయ్యాల ఆడబిడ్డలవంటి
పెద్ద పెద్ద మోదుగు వృక్షాలకు
నిప్పు బట్ట కట్టించిన రీతిని—

నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగడానికి వ్యాకరణసూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక
దిసమొలల్తో ఉరుకుతున్నాయి లోకాన పడి ;
దండించనా,

రండి రండని పిలిచి నా కవిత్వపు
పండు వెరుపు చేలా అందించనా !
కటికరాతిగోడలతో కట్టిన కారాగేహంలో
గత కాలపు శాసనాల
కట్టుబడిన ఖైదీవలె
భయం భయంగా, అప్పుడ్పు అప్పుడ్పుగా
గాలి పీల్చుకుంటావేం భాయీ !
ఊపిరితిత్తుల్ని కొలిమి తిత్తులుగా
నొక్కి-నొక్కి- ఊది ఊది మండించవోయ్ మానవతా జ్వాలావళి.
కదల్లేని వృక్షం వలె
కాలం అక్కడక్కడే పెరగ్గలదా !
'నయాగరా' జలపాతం వలె
నడుం విరిగేట్టు దూకంది తప్పదు గదా !
తిరగనీ కాలాన్ని సుళ్లు సుళ్లుగా :
పడనీ బ్రతుకు నిండా చిక్కులు ముళ్లు ముళ్లుగా.

డొక్కకు దాగా ఆకలిరుచి దొరకనీ—
చలి వీణలు నరాలలో చొరబడి
చక్కని పాటనొకటి వాయించనీ—
ప్రశ్నలు గొలుసులు గొలుసులుగా
బంధింపనీ మన మేధను—
దూకి దూకి ఈ జలపాతం
ప్రాకించనీ పైకిపైకి విద్యుద్వల్లీమతల్లికలను—
సన్నని ఇసుక కణం పరీక్షించి
జగజ్జాతకం వ్రాయనీ శాస్త్రజ్ఞులను—

ఏడిగ్రీలో వేడి నిలిస్తే
ఏరకం ప్రాణికోటి పుడుతుందో—
ఏడిగ్రీకి వేడి జారితే
ఈ విశ్వ మహాగోళం మృత్యుజలధి అంతస్సున
తన్నుకులాడి నశిస్తుందో—
ఏ ఖిల్లా గోడనీడ
ఏ మహారాజ వంశాన్ని ఎంతకాలం కాపాడిందో;
ఏ రకం ఎత్తుగడతో పెత్తనం
ఎవడెవడి చేతిలో ఎన్నెన్ని నాళ్లుంటుందో
పరిశోధించు ఈ లేబొరేటరీలో.

అజంతాలోను హలంత భాషలోను
శిలా సుందరికి లేని
ఉద్బాధా సంచలనం
పల్లెపడుచు కున్నాదని గమనించుకో భాయీ।
నిశ్శబ్దంగా నిదరోయే
నిరపరాధి పరమాణువు
డొక్కచించి డోలుకట్టి
ప్రమాదాలు తేబోకు
మస్కెట్లనుండి రైఫిళ్లదాకా నడచిన దేశం
కొడవళ్ల నుండి* కోత యంత్రం దాకా సాగలేదు.

చల్లని పాలుతాగే పిల్లులవంటి
రసిక శిఖాముఖుల నాల్కలు
వేడి వేడి కవిత్వం చురుకుదనం సహించేదాకా రాలేము.

---
*Harvestor.

ఇంకా అక్కడక్కడా ఎత్తైన గడీగోడ నీడలు
చిన్ని చిన్ని గుడిసెల్ని పెరగ నీయడం లేదు—
ఇంకా భయంతో తలవంచుకుని
తన నీడనే తాను చూసుకుంటో
బరువుగా బరువుగా నడుస్తున్నాడు బానిసీడు.

ఇంకిపోయిన పెద్ద పెద్ద సముద్రాల వలె
జీవం చచ్చిన పాత జాతుల నోళ్లలో
ఒకపెద్ద ప్రళయ జలధరాన్ని పట్టుకువచ్చి
కట్టివేసి ఉరిమించి ఉల్కాలు కురిపించి కరగించి
జీవనం ప్రసాదించే శుభిక్షకాలం ఇంకా రాలేదు.

ఇన్ని శతాబ్దాలు ప్రయాణం చేసినా
ఇక్కడేవున్నాం ఈ ఊరి పొలిమేర పక్కన
డార్విన్ బయాలజీలో పరిణామాల పట్టిక
పది యోజనాలంత వున్నా
మానవుడు మానవుడయ్యే కాలాన్ని
నిర్దేశించగల ప్రదేశం కానరాదు ।

గతంలోంచి కొంత నేర్చుకోబోయి
గతానికి తాకట్టు పడుతున్నారు కవులు
ఈ లేబొరేటరీలో కూచుని
లోకంనిండా విరివిగా శాంతి పండే రీతిని
కొత్తరకం విత్తనాల్ని
కనిపెట్టే వీలున్నది.
ఈ లేబొరేటరీలో కూచుని
కలం పాళీ కొనలోంచి

ఎంత బలంగల కవిత్వం సృష్టించ వచ్చో—
పేదాడి స్వేదం లోంచి ఎంతగా
దేశానికి జీవం ప్రసాదించవచ్చో—
నిరాశతో ఏడ్చే దరిద్రాంగన
కన్నీటి చుక్కలకు
ఎంత దూరాన నవ్వు పువ్వులున్నాయో—
హృదయంలో ఏ పొరలో దయ
ఏ తెరలో నిర్దయ
ఏ దిక్కున త్యాగం
ఏ దిక్కున రాగం దాక్కుని పెల వేస్తాయో—
కనిపెట్టే అవకాశం
ప్రసాదించి నా నిదిగో!
పని సాగించుము భాయీ!
బ్రతుకు నాగజముడు కూడ
పూలు పూయనీవయ్యా!
మెతుకులలో ప్రోటీనులు
మిక్కిలిగా రానీవయ్యా!
బక్కపడిన దేహానికి
పొందు పొందు మాంసానికి
ఎంత తిండి కావాలో
ఎంత హాయి కావాలో
అవి అన్నీ కల్పించే
అమృత ఘటికకోసరమై
నిరీక్షించు మానవునికి

త్వరగా ఫల మందించే
మార్గా న్న న్వేషించు !
మస్తిష్కంలో వెలిగే
మా యింటికి ముందుండిన
లేబొరేటరీ తెరచి వుంది.
మధనపడే మేధావుల
శిధిలాశలు చివురించే
రసరాజ్యం, లేబొరేటరీ !



## "విగతం తరణమత్ర వైతరణీ—"



రెంటాల



చీల్చిన శిరస్సులాగుంది జీవితం
అస్తమించే సూర్యబింబంలాగుంది ఆశ
కళ్లల్లో చీకటి, గుండెల్లో కుంపటి
నడిశిరసున నాగుబాము, నడిచేలో నాగజెముడు
లగ్నంలో శనిగ్రహం, రాహువుతో సంయోగం
క్షణ క్షణం ఉరికంబం, ప్రతి నిముషం భయవికలం
ముందు వెనుక వైతరణీ !

వయసులో ఉండగనే వైతరణి వచ్చింది
పయసు చెల్లకముందే వార్ధక్యమొచ్చింది
నిండు యౌవ్వనంలోనె నెరసినవి కేశాలు
పండు వెన్నెలలోనె మహాకాయ పక్షులు
సమరంలో సంధి పత్రాలు
సంధి పత్రాలపై సంతకాలు।

జాత్యంధుని శయ్యపై
శ్మశానాన గోరీపై
శరత్ వెన్నెల కాస్తున్నది
నాచుట్టూ అమావాస్య
పెనవేసుకొని నడుస్తున్నది।

జీవరేఖ ( Life Line ) ఆదిలోనే
అంతమైంది
కాలం జరగదు
కంఠం పలకదు
కదలదు భూగోళం।

కన్నీటి మడుగులో కాలూనగాలేను
కాటిలో కమలాన్ని నాటగాలేను—
కష్టాలు నెత్తికెత్తుకొని
కాలుపెట్టాను కళ్యాణమంటపం
కట్టుపుట్టం కొంగున
కట్టుకున్నా నగ్నిహోత్రం।

నిన్న జరిగిందే ఈ వేళ
ఈ రోజులాగే రేపు—

ఆకాశం అందుకొనుట కసమర్థుడు
యత్నిస్తే ఏమవుతుంది ?
పగిలిన గ్లాసును అతికించగలమా ?
పాసిన అన్నంబు పక్వానికొచ్చునా ?

కల్పిత భయాల భవంతిలో బందీగా
కమ్ముతున్న విద్యుత్‌బంధనాల కింధనముగా
ఎన్నిసార్లు మృత్యువు ?
ఎన్నాళ్లీ మరణ శిక్ష ?
ఎన్నాళ్లీ జనన శిక్ష ?

మూల్గుతున్న సముద్రంలో
ముత్యాలు సేకరించబోయి మునిగిపోయాను
అద్దంలో విరిగిన ఛాయలు
అణువణువును రగిలిస్తే
నిద్దురలో సుఖమరణం వాంఛించాను—
కాని
వచ్చినట్లు భ్రమగొల్పి వెళ్లిపోయింది
బ్రతుకో, చావో తెలియదు
భయమూ, అభయమూ బాధిస్తూనే ఉన్నాయి
వీటివైశాల్యం తెలుసుకోలేకున్నాను—

ముందు వెనుక వైతరణీ
ఎటు చూచిన వైతరణీ

వాగ్దేవికి, ప్రాణకాంతికి అడ్డంగా పారుతోంది
కట్టలుతెగి, గట్టులుతెగి ముట్టడిగా పారుతోంది
అడుగుతున్నది గోదానం
చెప్పమంటున్నది సమాధానం।
అగాధమైన వైతరణిలో
భగ భగ మండే వైతరణిలో
యుగాలుగా నిలబడి వున్నాను
గోదానమిచ్చే కొమరునికోసం
వేచియున్నాను।

# గోదానది పొంగింది.

రాంషా

"ఓ...రొర్.. ర్రోయ్।
హోరి కన్నా।...హోరి కన్నా।
ఒహూర్...వెంకన్నోహేయ్।
ఓ...హోయ్।"

" ప్రొద్దుకుంకేసింది—గోదా
పొంగి పొరలేలాగ ఉంది

పెందకాడే పసుల తోలుక
దేగిరారా ఓరి కన్నా!
ఓ...రొరే...ర్రోయ్!"

కన్నతల్లీ—కన్నతండ్రీ
కన్నకోసం—కేకవేస్తే
కన్నకడుపుకు—చిచ్చె పుట్టిందో
కన్న కసలే చెవిని పడదు.



ప్రతీచీదిక్కూన పుట్టిన గాలులు
అల్ల నల్ల నల సల్ల నల్ల నై
ప్రళయకారులై
హృదయభేదులై
భైరవ భీకర ప్రళయ సమయ
పర్జన్యపు గర్జల చేసెను.

హోరు హోరుమని వీచేగాలికి
చెట్లతలలు ఢీకొన్నవి నేలను:
తరగ లేచినది తాళము ఎత్తున;
ఘోరు ఘోరుమని లేచే తరగకు
తరగ విరిగి పెన్నురుగు క్రమ్మినది
లంకచుట్టునా నురుగు చిమ్మినది
ఘోరు ఘోరుమను రంగత్తుంగ తరంగ సంతతులు
లంకచుట్టు నా సికతాతలమున
చుట్టుముట్టినవి

ముట్టడించినవి
లంకచుట్టు నా సికతాతలమున
పొంగిపొర్లినవి
పొర్లిపోయినవి
ఘోరు ఘోరుమను రంగత్తుంగ తరంగ సంతతులు
చూపుమేరలో సికతాతలమున
చుట్టుముట్టినవి
పొంగిపొర్లినవి



అయ్యో కన్నా! అయ్యో కన్నా! వెఱ్ఱివెంకన్నా!



క్రమ్ముకొచ్చే చీకటులలో
సొమ్ములన్నీ ఇంటికొచ్చెను
కన్నమాత్రం కానుపించదు—
కన్నకడుపున చిచ్చె పుట్టిందో!



రుద్ధగాత్రమున తల్లితండ్రులూ
'కన్న ఏడి?' అనగా
అఱ్రులు చాచెను ఆలమందలు
'అంబా' అని తాము;
'కన్నకొరకు మా కడుపున చిచ్చా?'
కన్నతల్లి అడుగుటా;
కంటనీటితో శూన్యభావమున
తలలుత్రిప్పు ఆలూ.

'మీ పొట్టకోసమై తోలిన కన్నడు
  కన్నదేదె తల్లీ ?'
ఆలతల్లులకు తెలుసో ఏమో
  తెల్లబోయె నపుడు ;
కన్నకోస మా కన్నతల్లి తా
  పలవించిందపుడు ;
తల్లి శోకమును కనలే కప్పుడు
  ఆలు భోరుమని ఏడ్చెగా ;
కడుపుమంటతో కాలిన కడుపున
  కన్నతండ్రి నిట్టూర్చెగా.

"తల్లులారా ! తండ్రులారా !
పొంగిపొర్లే తల్లి గోదా !
కన్నకోసం ఏడ్వమన్నారా ?

  సొమ్ములారా ! తరగలారా !
  కన్న కడుపున చిచ్చుపెట్టేరా ?
  ఒక్క కడుపే ఒక్క కొడుకే
  దక్కకుండా పొట్టపెట్టేరా ?

తల్లి ఏడ్చెను కన్నకోసం
తండ్రికూడా కుమిలిపోయెను ;
ఆలమందలు హడలిపోయెను ;
తరగ పొంగులు తరిగిపోయెను ;

  కన్నకోసమయి విలపిస్తూనే
  ఒడ్డుకడకు తా వచ్చిన తల్లిని

తల్లి శోకముకు కరిగిన గోదా
అలలు పనిపికొని కడిగెను పాదాల్.

తల్లి శోకముకు కరిగిన గోదా
తల్లడిల్లెనో కడుపు చిచ్చునకు
పటాకిపోయెనో పుత్ర శోకముకు
అలల పంపినది కన్నని తల్లికి.

కన్న కొడుకు గతి గాంచిన తల్లీ
గోలుగోలుమని మూర్ఛపోయినది
తల్లిశోకముకు కరిగిన గోదా
తిరిగి తిరిగి తన తరగల పనిచెను

శాశ్వత నిద్రకు తరలిన కన్నని
నిశ్చల సమాధి నియమించిందో
కన్నకొడుకు గతి కాంచిన తల్లీ
గోలు గోలుమని గోలపెట్టినది.



తల్లి గోదా! తల్లి గోదా! కడుపు నిండిందా?



# శర్వరీ గీతం

సోమసుందర్



ఎంత చక్కని కన్నులమ్మా,
ఎంత ఎర్రని పెదవులమ్మా,
వంతలను మరపించునీ దర
హాస చంద్రిక రేవి శాంతీ!

స్వేచ్ఛారుణ కాంతి మెరిసే,
స్వచ్ఛ కౌముదు లెన్నొ విరిసే,
శుభ్ర గగన తలమ్ములో - నవ
రణ విఘాతము లేల శాంతీ!

పాల బుగ్గల మెరపు తావుల
కాలకూట విషమ్ము సోకగ,
నాగసాకీ నగర వీథుల
పాత గాయాలేల శాంతీ!

పచ్చపచ్చని పంట పొలముల
నెచ్చెలులతో కలుపు లేరుతు,
మచ్చి కోలు పదాల నింపుతు,
గడుపు మనుగడ లెపుడు శాంతీ!

తూర్పులో యాలూ మహానది
కేర్పడిన దొక విపత్ ఘట్టము,
మార్పులేని జిఘాంసతో - రణ
వ్యాఘ్రములు గర్జించె శాంతీ!

తెగిన కొరియా ఉరోజాలను
రగులుచుండె ప్రతిజ్ఞ కీలలు,
వగలు నిండిన నేలలో - పగ
తెగసె దారుణ మగుచు శాంతీ!

చలువ తెమ్మెర వీచకుండా—
వెలుగు రేకులు విచ్చకుండా—
విలువ బ్రతుకుల నింపకుండా—
సమర భీషణ మేల శాంతీ!

వలపు చెలి వా తెరల తేనెల,
తలపు తెరువుల పసిడి సోనల,
నరుల హృదయామృతపు వాకల,
విషద్రవ మొలికింది శాంతీ!

నీచ సమరోన్మాద రాక్షస
కీచకులు భూదేవి నొసటను
పసుపు కుంకుమ చెరుప దలచిరి—
వీచుమా కారుణ్య గీతము!

వీచుమా కళ్యాణ గీతము.
కాచుమా వసుమతీజాతము,
సాచుమా నీ వజ్రహస్తము,
బ్రోచుమా జనగణము శాంతి!

# ఓ స ఖా!

## ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

రాగమెరుగని వీణ—రక్తి నెరుగని గాణ
ఎదద కీలలు రగులగా—ఓ సఖా!
ఏ గీతములు పలుకునో ॥రా॥

పాషాణ హృదయాలు—పాలించు లోకాన
ద్వేషమే పంట కాదా—ఓ సఖా!
ప్రేమ కలువై సురుగదా— ॥రా॥

కొసరి నీ యశములో—విసము కలిపిన చేయి
దెసలెల్ల నెత్రు పూసె—ఓ సఖా!
కసిరేచి కత్తి దూసె— ॥రా॥

తెగిన కంఠము తోడ—తేటి పాడినపాట
సొగయునా నీ యెదంద?—ఓ సఖా!
పొగులదా కన్నీటితో?— ॥రా॥

# జలదగీతి



సి. నారాయణరెడ్డి



సాగుమా ఓ నీలమేఘమా।
గగనవీణా మృదుల రాగమా।
  చిటపటరిన చేల
  పీయూషములు రాల
  గరికలేని పొలాల
  మరకతమ్ములు దేల
సాగుమా ఓ నీలమేఘమా।
  నెమలి పాదాల కిం
  కిణులు 'ఘల్లు'న మ్రోయ
  ప్రియురాలి వలపు మ
  ల్లియలు జిల్లున పూయ
సాగుమా ఓ నీలమేఘమా।
  కవిరాజు నిను జూచి
  నవనీతమై పోవ
  నవనీతమై పోవ
  నవగీతమై లేవ
సాగుమా ఓ నీలమేఘమా।

నినుజూచి విరహిణులు
నిట్టూరుపులు నింప
నిట్టూరుపులు నింప
నిలువెల్ల పులకింప

సాగుమా ఓ నీలమేఘమా ।

గుండె లోతుల పాదు
కొన్న పాతదనాలు
నీ పదమ్ములు తాకి
నీరు నీరై పోవ

సాగుమా ఓ నీలమేఘమా
గగనవీణా మృదుల రాగమా.

---

## ఉ షో బా లి

---

వి దుర్గాప్రసాదరావు



౧

నిత్య జగత్ క్షేమ
        కార్య కర్తృత్వమ్ము
నిత్యోషఃక్షుభిత జగ
        త్కర్మ సాక్షిత్వమ్ము

నిత్యజాగ్రదవస్థ
నిర్నిమేషత్వమ్ము
అతివేగ గతి రోద
సీ నిత్యభ్రమణమ్ము
నను, విసిగి, వేసారి
క్షణమాత్ర మెందేని
పరశక్తి కర్తృత్వ కరణమందున తాను
కర్మధారక క్రియగా కర్మమాత్రుండగుచు
యోగనిద్రామూర్తి
గా, నపేక్షించె
నాదిత్యుండు.

౨

గిరి శిఖరి చూచుకము
లరుణహేమద్యుతి
స్ఫురణ రాగమ్ములై —
పదసటన సంచరిత
ఉదధివీచీలహరి
డమరుకోద్భవనాద
సమసప్తస్వర మేళ
మురరీకృతమ్ముగా :
అంబరాంచలచకిత
అంబుదాళీ జ్వలన
సప్తవర్ణ ద్యుతి

క్షిప్తప్రభారాశి
దీప్తమై వెలుగొంద ;
కాషాయరుచిరాంగ
భీషణోత్త్యౌత్సుక్య
వేషసుందరమూర్తి
యోషామశక్తిమతి ;
పూషదేవపురుషాభిగ్రహావుం
ధిషణదాహమున సంధ్యారాగిణి
పురుషాయితకేళీలాలస
మృదులమేఘహస్తయుగము
హృదయపుటాహ్వానముగను
సాచికౌగలించుమనుచు
నాచికొనియె సూర్యదేవు.

3

పేగుజుక్కఁ వెలుగులలో
యోగనిద్రశ్రాంతుండయి
తమసి పెడద షుప్తినందు
కౌమరదేవు బాలార్కుఁని
మమతగనియె నుషోబాల.
పసియెడంద చిందులాడు
హాసనపూర్ణ మధురిమమున
నులివెచ్చని చిరుచేతుల
గిలిగింతల కౌగిలించి
మోమూ మోము గదియచేర్చి

గోముగ మేల్కొలుపు లాడె.
తన సామ్రాజ్యమునం దెచటను
కనుపించని కలిమిగాంచి,
ఉషసి నాసికాగ్రవాసి
ఇషుధన్వుడు నిట్టూర్చెను.

....　　　　....　　　　....

"కస్త ఉషఃకథప్రియే
భుజేమర్తో అమర్త్యే
కన్నక్షసేవిభావరి".

....　　　　....　　　　....

"విశ్వమస్యానానామచక్షసే
జగజ్జ్యోతిష్కృణోతిసూనరీ
అపద్వేషోమఘోనీ
దుహితాదినఉషాఉచ్ఛదపస్రిధః."

....　　　　....　　　　....

కుత్స శునశ్శేఫ
కక్షీవాన్ ప్రస్కణ్వ
ఋషిలోకపౌరిక్తమ్ము
ఉషసి గీతావళుల్
మలయా నిలములలో
యలముకొనె జగమెల్ల.

....　　　　....　　　　....

కనువిప్పని మెళుకువలో
వినిపించిన గీతికలకు

కనులుతెరచి ఉషోబాలఁ
గనియెప్రీతి రవిదేవుడు.

.... .... ....

ఒక్కొక్క ఉక్కమ్ముతో
తేజమ్ము
లొక్కెడ ప్రజ్వలితమై
ఎరుపు బంగరు చాయలూ
మిరిమిట్లు
వెలుగులో మణిగిపోగా
దీప్తి జ్వాజ్వల్య భాసితమ్మై
తనువద్ది
ఎల్లెడల నిండిపోతూ.
ఆదిత్యు
డుషను కౌగిటబట్టెనూ
ఆదిత్యు
డుషను కౌగిట బొదివెనూ.

... .... ....

తెలతెల వెలవెలబోతూ
తను మేల్కొల్పిన బాలుడు
కనుమరుగై ఈరూపము
తనుబట్టగ—హాస్యమ్మై.
కౌగిట నవనీతమువలె కరగిపోయె నుషోబాల.

౪

కౌగిలి బయలై పోగా
కలవరమున దిశలచూచి
'ఉషో! ఉషో ఉషో' యనుచు
బయల్వెడలె తరణి సాగి.

.... .... ....

హిమగిరినగ శిఖరాంచల
హిమబిందువులందు ఉషసి
దాగెననుచు కరముసాచి
కౌగిలి రిత్తగ, మరలుచు—
హా! ఉషో! ఉషో! ఉషో!
మానస సరోవరోద్భవ
హేమాంబుజ పత్రచలిత
హిమకణద్యుతులాశగొలుప
"హా ఉషో! ఉషో! ఉషో!"
క్షీరాంభోధ్యంతర్గృహ
కారాబద్ధమ్మైన
నవనిధిరాసుల పోడిమి
చవిచూచుచు నిస్పృహతో—
"హా ఉషో! ఉషో! ఉషో!"
లోకాలోకస వేష్టిత
శ్రీ కేశవపదసమీప
నాకధునీ శీకరాంబు

హేవాకము సేవించియు—
"హా! ఉషో! ఉషో! ఉషో!"
ఏకాదశ రుద్రలోక
ప్రాకారములెల్ల దాటి
హరనేత్రముగా నిలుచుచు
గౌరీపతి కంటి జ్యోత్స్న
లందు ఉషనిగాంచి, కరము
లందుకొనగలేనిబాధ—
"హా ఉషో! ఉషో! ఉషో!"

.... .... ....

తిరిగి తిరిగి వేసారుచు
తరుగుచు కృషియింప తనువు,
నడిమింటను నిలిచి, గొంతు
పొడి యారగ తుది జీరగ
రోదసి సర్వము నిండుచు
నాదమ్మది యలలు రేగ
'గీ' పెట్టినయట్టులరచె
"హా ఉషో! ఉషోబాల!
దివోదుహిత! విభావరీ!
కనులనిండి కనుపించుచు
కరము సాచ మాయమౌదు
వెందుబోతివోహో! బాలా!
రావే! రావే రావే! ఉషో!
హా! ఉషో!"

.... .... ....

రోదసి కంపించియాగి
నాదమ్మది శాంతివొంది
నంతలోనె యంతరిక్ష
"మో" యనె రవిదేవువెనుక
తన పరిచితస్వరమువినుచు
క్షణమూహల యాగిపోయి—
"ఛాయా ?"
"ఆ !"
"ఉషోబాల నీవేనా ?"
తాటంకాచలనముతో,
తనురేఖలు పొంగిపోవ
"ఔ"నని గర్వపు టులుకుల
ఆనందమ్మొలుకబలికె
"ఛాయా ?"
"ఆ !"
"తమస్వినివి నీవేనా ?"
నతవదనం, మూకీభావం
బుతమ్మనుచు రవికిచెప్పె.



# పిలుపు

"మసూనా"



జగతి కంపన కనుటలేదా
జనత ఘోషల్ వినుటలేదా
చలన మెందుకు కలుగదోయీ
చలమ దెందుకు కలుగునోయీ!

వ్యాకులతతో స్రుక్కిపోయిన
చీకటులలో మ్రగ్గిపోయిన
వ్యధిత రక్తపు పొంగుసెగకున్
క్షుదాశీర్ణిత కేసరుల పగ
కెదురువెడలే వీరు లెవరోయ్
బెదురు కలుగని ధీరు లెవరోయ్!

ప్రళయ రుద్రుని పిలుతువేలా
కాళరాత్రుల తలతువేలా
లేచి రావోయ్ జనులకోసం
ఆచికోవోయ్ శాంతి కోసం—

# ఆ వ లి

నార్ల వెంకటేశ్వరరావు



ముద్దు పాప నిద్దురలో
తొంగి చూచి దోగాడే
చిరునవ్వుల కెరటమ్ముల
కావలనేమున్నదో ।

అరమోడ్పుల అక్షులలో
ప్రభారోచి ప్రభవించగ
సాగే పటు యోగనిష్ఠ
కావల నేమున్నదో ।

నీలాభ్రము, నీలాద్రుల
కమ్మని బిగి కౌగిలిలో
కరగే శీకర సీమల
కావల నేమున్నదో ।

విభావరీ ప్రభాతాల
ప్రత్యహా పరివర్తనలే
కీలకమా కాలోదధి
కావల నేమున్నదో ।

కవినౌ నా కల్లోల మ
నోవీథుల నూపే భీ
తావహ వాతావరణము
కావల నేమున్నదో ।

# నవోదయం

కరుణశ్రీ



గుండెల్లో నేడేదో
కొత్త ఆశ తలెత్తింది
ఎండిన వృక్షం మళ్లీ
ఎందులకో చిగిర్చింది

తీరని కోరిక ఏదో
తియ్యంగా హసించింది
అందని అందం ఏదో
అంతస్సును స్పృశించింది

తుంగభద్ర తరంగాలు
పొంగి పొరలి పోతున్నవి
బంగారపు గుడి గంటలు
ఖంగు ఖంగు మంటున్నవి

తెలుగు తల్లి గుడి తలుపులు
తీస్తారట యీ ఉదయం
"విశాలాంధ్ర" కే రాస్తా
వేస్తుందట నవోదయం

రా చెల్లీ! రా తల్లీ!
రా అన్నా! రా తమ్ముడు!
ఆంధ్రజనని అడుగులపై
అభ్యుదయం విరజిమ్ముడు!

# ఆత్మ ఘోష

ప్రయాగ కోదండరామశాస్త్రి



తారాతతి గ్రహసమూహ
మన్నీ పెన వైచుకున్న
ఆకర్షణ వలయంలో. సం-
స్తంభించిన ప్రశాంతిలో
అశాంతి వెతికే జీవులు
క్షణం క్షణం పరిభ్రమించే
నిరంతరం పరిక్రమించే
ధరిత్రిపై మోహం వదలక
శరీరాలు కప్పుకునే
సంరంభము చూడండి :
అనాదియై, అనంతమై,
జగద్వ్యాపియగు తేజో
మయమూర్తికి చెప్పుకొనే
మనవులు మనసులు వినండి :

ఏదో అది కొత్త చుక్క
ఇప్పుడే పుడుతున్నదేమో !
మున్ను నేను వచ్చినపుడు
ఉన్నది కాదే ఇచ్చట !

అయినా ఇది ఏమి వింత,
అసలు పాలపుంత గదా ?
సెగలు పొగలుగా గగనం
కాలికములు జ్వాలలతో,
ముక్కచెక్కలై దిక్కులు
పగిలి నొగులు వేగముతో,
నిన్న నడిచినట్టి గ్రహం
నేడు బూడిదై కూలును ;
అంతలోనె, ఆవిరిగా
కావిరిగా కన్పట్టిన
బూడిదయే కూడి మగుడ
కాంతి వేగములు తాల్చును !
ఇదే, వింత పాలపుంత
ఏదీ ఇటకాదు వింత,
ఉదయించే కోటి సూర్యు
లాదిగియున్న తల్లిగదా !

## జీవన చిత్రణ

పల్లా దుర్గయ్య



మనజీవిత పరిమాణం
మరమీదికి తిరుగుతోంది
మరమీదికి తిరుగుతోంది
'ధర'మీదికి పెరుగుతోంది.

అడుగుపెరిగి అంతుతరుగ
మిన్ను విరిగి మీదికొరుగ
నడిమితరం నరలోకం
నడుంయెముక విరుగుతోంది.

హలం, పొలం విడిచి కాపు
బలం 'రిక్ష' లాగుతోంది
పరామరిక లేక భూమి
బంజరుగా మారుతోంది.

ఆరాటం పెరుగుతోంది
ఆహారం తరుగుతోంది
'పరం'వైపు దృష్టి మరలి
నరం బిగువు సళ్లుతోంది.

అధికాహారోత్పత్తి
'అక్షరాల' జరుగుతోంది
సంసారం పెరుగుతోంది
సన్యాసం మరుగుతోంది.

పెట్టుబడి పెరిగి సొంత
గిట్టుబడిని కోరుతోంది
కట్టుబడిన కూలి నోట
మట్టి కొట్టి దాటుతోంది.

రూపాయలు రోజు రోజు
రూపులు మారుస్తున్నై

చిల్లరపైసలకడుపులు
చిల్లులుపడిపోతున్నై.

బంగారం రెక్కలతో
పరదేశం ఎగురుతోంది
ఇనుం జనుం తక్కెడలో
ఇరుప్రక్కల తూగుతోంది.

అన్యాయం జరుగుతోంది
అపచారం పెరుగుతోంది
సంఘసేవ పేరుతోడ
స్వార్థపూజ జరుగుతోంది.

అనుమానం అభిమానం
అధికారం దారిజూప
శాంతంతెరవెనుక సమర
సన్నాహం జరుగుతోంది.

బలం ధనం ఇరుప్రక్కె
బలాబలం తేల్చుకొనగ
బలం ధనం లేనివారి
బలిదానం జరుగుతోంది.

మేధతోడ ఉరుకలేక
హృదయం వెనుజిక్కుతుంది
పట్టపగలె ధర చీకటి
కొట్టై కనుపిస్తూంది.

నెత్తిమీద నోరుంటే
పెత్తనం లభిస్తూంది
తెలివి ఉంది ఊరుకుంటె
దేబెపేరు వస్తూంది.

ఆలోచనపై శ్రవణం
అధికారం చేస్తూంది
సూక్ష్మంలో మోక్షంకై
చూస్తున్నది రసికజనం.

కాషాయపు గంతలలో
కామం ప్రసవిస్తోంది
ద్వాదశిపారణ వాసన
ఏకాదశిని సహిస్తోంది.

## ధమ్మ ఘోష

రమణారెడ్డి



జగత్తులో మిజరీ వున్నది
మిజరీపై కలదు మిస్టరీ;
మిస్టరీ బట్టలు విప్పాలని
మిజరీ గిట్టలు త్రుంచాలని

కర్మాగారాలు పొలాలు వంటయిళ్లు
ఏకంగా అంగారంగా ఆగంగా వూర్ధ్వముఖంగా
వివిధంగా బహిరంగంగా వేగంగా బాహాటంగా

శోకానికి హేతువు పైకం.
పైకానికి ఆసట మైకం.

మైకాలను వర్జించాలని శోకాలను నిర్జించాలని;

మిజరీలకు హేతువు మైజర్
మైజర్లకు ఆసట ఖైజార్

ఖైజార్లను వంచేయాలని, మైజర్లను దంచేయాలని
ఈరోజీలోకం సకలం కలకలమను న్యాయస్థానం.
ఉత్సాహం మోక్షపు మార్గం. నిర్వాణం సామ్య ప్రపంచం
నిద్రాణత క్షయనే చూపుట. నిద్రాణులు మరణ కణమ్ములు.
ఏ సత్యం అన్వేషిస్తూ ఏ ధర్మం పరిశోధిస్తూ
చీకటినీ కాటిమంటనూ లాఠీనీ జైలుగోడనూ
లంఘిస్తూ ముందుకు తెలివికి ఇన్నాళ్లూ పోతున్నామో
ఆరాస్త్రా స్థలపరిసరమును మృతిసయితం ఏర్పరించదు.

అడవులలో ప్రేక్షరుమనమై
ఎడారిలో ఒయాసిస్సుమై

మనమూర్తులు ధర్మతేజమై మననీతులు అసిధారలుగా
మనమివ్వుడు అగ్నిస్కంధులు, మనమిప్పుడు బోధిసత్వులం

సోమరిపాటల వందలకంటే
అకలిగీతం ఒకటి మేలయా!

అర్థమనస్కులు వందలకంటే
అర్థాయుష్కుడు ఒకడు మేలయా ।
లోక జీవనపు చండభానుతప
నాగ్ని ధాకలకు తాళినవాడే
మహాత్ముడనగా మహర్షియనగా ;
మానవకోటికి సూటిబాట దరి
జూపినవాడే నాయకుడనగా.
ముందు ముందు మత్తు మందు
ముందు ముందు మిత్తి కలదు :
బ్రతుకు అతుకుబొంత, జగము యిరుల కంత ;
నౌరోజా ఉత్సవమే మనగమ్యం, కాని ముళ్లకంప;
రోజాపువ్వుల వంటివి కామితాలు, ఆదర్శాలన్నీ కలలు.

## నటరాట్టు

పఠాభి

●

ఎగరగొట్టబడి
విడిన జుట్టుముడి
నల్ల గట్టులాగు గనబట్టు
గిరుల నట్ట నడి
దుముకునట్టి వడి
గలిగి అట్టహాస్య నదిపుట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు.

ఉడుకు నాలికల
ఉరుకు పోలికల
కనలు మట్టి కోరికల జట్టు
పయికి లేచి కడు
పువులు పూచి పడు
అతడి పట్టు పాదముల చుట్టు
మిగుల నాట్యమాడ నటరాట్టు.

అపుడు లోకముల
సుఖము శోకముల
ఇనుప పట్టుకారులవి పట్టు
తిరిగి బాష్పములు
తిరిగి పుష్పములు
అతడి మట్టుక్రింద తుదముట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు.

---

## మధ్యాహ్నం వేళ

---

### బైరాగి



తమ్ముడూ ! తమ్ముడూ !
ఏమిటి చేశాను నిన్ను ?
మింటినుంచి మండుటెండ కురుస్తోంది
రాతిరోడ్డు మెరుస్తోంది.

సాగినాయి వడ గాడ్పులు
ఎదలో ఎండిన ఏడ్పులు
మండే వీధుల్లోన ఎండుటాకులు, వాడిన పూలరేకులు.
చెమటలు కారుతున్నయ్
చూపులు పోరుతున్నయ్
తీక్ష్ణ సూర్యకాంతుల్లో.

నడుస్తున్నాం మనుషులం
తలలువంచి కొంపరగా
మూసిన దుకాణాలు, ఇళ్ల తలుపులు
మూసిన మనసులు.

ప్రపంచం మండుకోంది
తమ్ముడూ ! తమ్ముడూ !
ఈ అట్ల పెనం మీద
ఈ ముళ్ల డొంక లోన
ఈ రాక్షస లంకలోన
ఎందుకు నిలబడ్డావో ?

ఈ దుమ్మూ, ఈ చెమటా
ఈ కనుల చింతనిప్పులు
నీ కన్నులు నీ కన్నులు
వేసవి కాలపు మిన్నులు
ఎందుకు నిలబడ్డావో ?

ఆబయటకు రాని పిలుపు
ఆ చూపుల ఆరాటం
తెరిచీ తెరవని పెదవుల

సగమాగిన ఉబలాటం
ఈ పండే మధ్యాహ్నపు రోడ్డుమీద
ఎందుకు నిలబడ్డావో ?

నీ హృదయంలో వినయం
నీ బెదురు కనుల చూపు
సగం ఆశ అయోమయం
ఒక సత్తువలేని డాపు
నీ వడుగని ఒక్క ప్రశ్న
నీ పలుకని ఒక్క పలుకు
తాల హృదయశల్యంగా
మరిమరి వేస్తోంది కలక
గ్రుడ్డివాణ్ణి, చూడలేదు
నీ హృదయపు పెనుగులాట
చెవిటిని, వినలేకపోతి
నీ పెదవుల పాడని పాట
నా దేహపు రాతి గోడ
మూసిన గ్రంథపు భావం
ఇక తెలియట మెలాగ
హృదయపు రక్త స్రావం
ఏమిటి చేశాను నిన్ను తమ్ముడూ ?

కొన్ని ఏళ్ల మైలు రాళ్లు
దుమ్ము, త్రోవలో అలసట
మధ్యాహ్నపు మండుటెండ
కాలే దేహాల చెమట

మూర్ఛలోని యాత్రాంతం
గిర్రుమనే జ్ఞాపకాలు
నీ వదుగని ప్రశ్న లేదు
చేస్తున్నది సవాలు
ఆరిన బూడిదలో ఒక
నిప్పురవ్వ రగులుతోంది
పురల తిరిగివచ్చిన ఒక
క్షణపు బాధ మిగులుతూంది.
బాధలేని క్షణం రాదు
నీడ లేని బాధ కాదు
మధ్యాహ్నపు రోడ్డుమీద
ఏమిటి చేశాను నిన్ను తమ్ముడూ ?

# చావని సంతానం

తా. రా. స్వామి



ఆకారంలేని
అనంతకోటి సంతానం
నా శరీరపు ప్రాకారాలల్లో
పుట్టి పెరిగి
గుట్టలౌతున్నయి.

వాయి లేని నాలోని
ఈ పాపాయిలంతా
సాగిస్తున్న ఘోషలకు
ఊగిపోతున్నాయి.

బలుపెక్కిన నా అస్థిపంజరపు
ఉక్కు గోడలు కూడా
ఆకలి, ఈ నా పిల్లల ఆకలి
ఏకాలానికి తీరలేదు తీరబోదు.
అప్పటికీ నా పిల్లలు చావరు.
నా జీవితకాలంలో ఎప్పటికీ చావరు.

కరువులు కాటకాలు రానీ
ఉరు మేఘాలతో తుఫానులు వీచనీ
అప్పటికీ నా సంతానం చావదు.

పుట్టుకతోనే పుస్తె కట్టాను
పుట్టుకతోనే నా ఎదలో
పుట్టిన చిట్టి హృదయానికి
క్షణ క్షణానికి నా హృదయం
గర్భ పరపరలను దాలుస్తూ
అనంతకోటి సంతానాన్ని
అందించింది ఇంకా
అందిస్తున్నది.



# గాలి వాన

వానమామలై వరదాచార్యులు



ఎదురు గాలిదుమార మెవరాగగలరు ?
బెదరి వెన్నుజూపి వెడలిపోయేరు !
పిడుగు గర్జలగుండె లదలిపోసాగె
మెరపుదీగల కండ్లు మిరుమిట్లుగొనియె
ఎచటినుండరుదెంచె నీగాలివాన ?

ఇది ప్రపంచముముంచ నెగయు తుపాను !
ఛత్రములు పట్టుకొని చనువొద్దదొరల
నేత్రముల మనుగొట్టినెట్టు వెనుదటల
పచ్చికుండ్లై విచ్చిపైబడునో మబ్బు ?
భవనమ్ములన్నియును పై గూలిపడునో ?

కూలీల నిట్టూర్పు గాలిదొంతరలు,
రైతుకన్నులనుండి రాలు బాష్పాలు
కాపుల - కూలీల - కష్టజీవుల యొక్క
మనసులన్నీకలిసి మబ్బులై, మాయలై,
ఉరుములై, మెరుపులై - ఉగ్రూతలూచె !

# శాంతి



## దేవులపల్లి కృష్ణశాస్త్రి



**జగదంతర దేశదేశ జనులార వినరా ?**

**వినరా యిక వినరా ।**

**వంతలేదు చింతలేదు — శాంతి శాంతి శాంతి శాంతి**

కాటకముల నలిగినారు — బూటకముల కలిగినారు

వేడి వేడి నెత్తుటేళ్ళ — ఓడచి యిన్నాళ్ల మీరు

ఆసలేవి అంసమ్ముల — మోసికొనుచు మనినారో

కోరికలెవి గుండె గుండె — తోరణాల కూర్చినారో

అర్థరచిత మహాంకార — మంధప్రభులు నిరంకుశత

వ్యర్థనాశకారణముల — నర్థములవి గ్రహియించే

ప్రజలారా వినరా

వినరా యిక వినరా యిక

ప్రజాస్వామ్యలోకమ్మున

శాంతి శాంతి శాంతి శాంతి

జగదంతర దేశ దేశ జనులారా వినరా

వినరా యిక వినరా ।



# ఆంధ్ర గీతి



పైడిమర్రి సుబ్బరామశాస్త్రి



త్రిలింగదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్....

మధురం మధురం మధురం మధురం
ఆంధ్రమ్మంటే అతిమధురం....
దేశభాషలా తీరుల్లోకి
ఆంధ్రమ్మంటే అతిమధురం....

రాయలు మనవాడోయ్-పండిత
రాయలు మనవాడోయ్
కలంతిక్కనా ఖడ్గతిక్కనా
గణపతిదేవులు మనవారోయ్....

అమరావతి నాగార్జునకొండా
సిద్ధహస్తులా శిల్పాలోయ్
మల్లినాథ కుమారిలభట్టులు
అందెవేసినా హస్తాలోయ్....

గోదావరి కృష్ణా
తుంగభద్ర పెన్నా
కావేరి పంపా
కనిపెంచినవోయ్ తెలుంగుజాతిని
వినిపించినవోయ్ వీణానాదం....

ఓడలు కట్టేమూ-మింటికి
మేడలు కట్టేమూ
మున్నీరంతా ఏకరాశిగా
ముద్దరవేశామూ....

సంతలలో వజ్రాలరాసులూ
జెలజెల లాడినవీ
కుబేరతుల్యం మహదైశ్వర్యం
గొడుగు పట్టినాదీ....

కలకలలాడే తెలుంగుదేవికి
గంధాగురుధూపం;
కిలకిలలాడే తెలుంగుకన్నెల
కిన్నెరలాలాపం
బలంగడించీ వెలుంగునించే
తెలుంగుజండా 'హుం'
తెలుంగుభేరీ 'ధాం'

గణగణ గణగణ
గణగణ గణగణ
తెలుంగుజయఘంటా :
గణగణా గణాగణ
గణా గణా గణ
తెలుంగు జయఘంటా........త్రి॥



# కవి హృదయం



అమరేంద్ర



రకరకాల భావాలకు నా హృదయం రహదారి
వికసించని జీవాలకు నా కంఠం రణభేరి

నాలో నవ వసంతాలు
కోకిల మృదు కూజితాలు
మధుకర ఝుంకారాలు
మృదుసుమ మకరందాలు

నాలోనే శిశిరంలో

ఆకురాలి ఆశలుడిగి
భీకరమౌ మౌనంతో

ఓడిన రణవీరులవలె
మోడైపోయిన తరువులు.

నాలోనే సాధువులూ
సత్యకాంతి సాధకులూ
నిత్యశాంతి శోధకులూ

నాలోనే

దరిగానని తామసులూ
దయనెరుగని దానవులూ,
పాతకులు, కిరాతకులూ
తమ పాపపు కూపంలో
తన్నుకునే పతితాత్ములు
నాలోసుఖ స్వప్నాల్లో
సోలిపోవు ధనవంతులు
నాలోనే, ఆకలితో
చీకటిలో చెట్లకింద
శోకించే క్షోభించే
దీనులు, ధనహీనులు, బలహీనులు ;
నా హృదయం సంధ్యాకాశం
వెలుగు చీకటుల విచిత్ర లాస్యం
నా జన్మమె అవిరత సమరం
విరుద్ధ శక్తుల
విభిన్న వ్యక్తుల
కత్తుల మెరపుల
నెత్తురు ధారలు

రకరకాల భావాలకు నాహృదయం రహదారి
వికసించని జీవాలకు నాకంఠం రణభేరి.

నా ప్రాణం శాంతి సాగరం
నా గానం కాంతి సాధనం.

---

## బతుకు కిటుకు

---

ఊటుకూరి రంగారావు



దుస్సాహసం చేయకు
నిస్సహాయుడవై చావకు
చీకటి ముసుగును ధరించి
లోకంలో తిరిగే రక్తపాయ శార్దూలం
మీసాలనుపట్టి లాగి చెరలాడకు
బలికోసం ఉష్ణరక్త మర్పించకు
ఎదిరించకు మదగజాల గుంపుని
విదిలించకు గొప్పగొప్ప తలలని
పదునెక్కించకు నీ బుర్రకి.
వ్యధతో గుండె పగిలి మరణించకు
కదలించకు భువనసౌధపు పునాదుల్ని
ఖండించకు సనాతన వృక్ష మూలాన్ని

కత్తిరించకు ప్రభువుల శ్వేత కేశాలను
వెక్కిరించకు విస్తృత ప్రజాస్వామ్యాన్ని
అనుభవాలకందని ఆదర్శాలతో
అక్కరకురాని వ్యవసాయం చేస్తు.
చేతిచమురు భాగోతం మొదలెట్టకు
చేతికి దొరకిందేదో విడనాడకు.
సరదాగా పదిరోజులు బ్రతకాలంటే
మురికాల్వలు శుభ్రంచేసే ప్రయత్నం చేయకు
నిజంగా నీవు బాగుపడాలంటే
నిజంగా నీవు గొప్పవాడివి కావాలంటే
చేరదీయి కొన్ని నరమృగాలను
చీకట్లో తిరిగే పెద్దపులులను.
ఆనందంతో, భక్తితో పూజించు
అన్యాయాలను, అక్రమాలనూ
ఏ 'ఇజ'మైతేనేం ?
మన బుజంబరువు తగ్గితేసరి,
ఇది నిజం.



# నవ భువనం

నారపరెడ్డి



అనుక్షణమూ దినదినమూ
ఎదుగుచున్న మానవుడను
నక్షత్రపు తలపాగా
చుట్టుకొన్న హిమశిఖరం
నాముందర తలవాల్చెను

నరజాతే చిన్నప్పుడు
కట్టుకొన్న ఈ సంఘపు
కరగోడల బొంతజెముడు
నీడలలో అణగలేను
ఇముడలేను.

ఇంత యిరుకు సందులలో
ఇంత మురికి గొందులలో
పాడుగుడిసె చీకటిలో
తలవంచుక మెలగలేను
వంగి క్రుంగి బ్రతకలేను

అనాటికి యిదిలోకపు
యిల్లైనా యీనాటికి
నరజాతికి జైలైనది.
జాతిగదులు, మతపుహొరలు
మనిషి మనిషి మధ్యనున్న
విద్వేషపు విషపుతెరలు
ఇరుకు మురికి నరకకూప
మై పోయెను.

తరతరాల పేరుకున్న
చెత్తలోన విషపురుగులు
అణువుదాంబు గుడ్లుపెట్టి
భీభత్సం జేస్తున్నవి.

గాలిలేని కాంతిలేని
తనుబరువే మోయలేక
పెళపెళమను పాతయింట
నరుడింకా బ్రతుకలేడు
నరుడికపై నిలువలేడు

అందుకనే అభివృద్ధికి
ఆటంకం మానవునకు
అపకారం కల్పించే
అపసవ్యపు పాతయిల్లు
వుప్పురిసిన సరిహద్దుల
కరగోడల పునాదులతో

కుళ్లగించి పెళ్లగించి
విధ్వంసం జేస్తున్నాం.

పురాభవన విధ్వంసపు
పాదుల్లో స్వాతంత్ర్యం
సమభావం సౌహార్ద్రం
పునాదులుగా విశ్వంవలె
విశాలమగు నవభవనం
నిర్మాణం చేస్తున్నాం

సరిహద్దులు కరగోడలు
విద్వేషపు విషచాయలు
లేని యిల్లు
జగమంతా ఒకేయిల్లు
జనమంతా ఒకేసంస్థ
నిర్మాణం చేస్తున్నాం.

---

## మ రా మ త్

వేముగంటి నరసింహాచార్లు



అనేక శతాబ్దాల
పునాదులపై లేచిన
చరిత్ర సౌధాలకు
మరామత్తు జరగాలి

చీకటి కూకటిలో
చిక్కిన జీవితాలకు
వెలుగు దారుల
తలుపు తెరవాలి
అడుగడుగున
ఆటంకాలతో
కొడిగట్టిన మానవతా
జ్యోతిశ్శకలాలను
ఉజ్వలితం చేయాలి
రక్త రంజితమైన
ప్రాచీదిశా ఫాలభాగాన
క్రమ్మిన మబ్బుదొంతరలు
బద్దలై పోవాలి
పడమటి ఎడారి
వడ గాడుపులకు
వాడిపోయిన
ప్రాణనాళికల్లో
నవచైతన్యం
నవరించాలి
మంటి పొరలందు
మాణిక్యాలను సృష్టిస్తూ
శక్తి తగ్గిన కందరాలకు
భుక్తి ప్రసాదించాలి.

# నయాజవానా

వి. శశాంక



శ్రీకారం నిర్మించిన సాలిగూళ్ళలో దాగిన
గరళమ్మే ప్రపంచమై....
ధౌతహిమాచలోచ్ఛలిత జలదాలే
జీవిత ఋతుపవనాలై....
పర్జన్యపు గర్జనలే
జగజ్జనుల నినదాలై....
భూ వలయితబాధార్ణవ
తరంగాల ఆర్తరుతులు
ఆకాశపుటవధులలో
ప్రతిధ్వనిత గాత్రాలై....
ఆకాశపు మహాదర్శ దర్శనలో
రక్తాక్షత జగద్దేహ
చలనం ప్రతిబింబితమై....
శ్రమాభిన్న విశ్వషాల
స్నపితస్వేద ఝరీవారి
వియత్తల సువిశాలాక్షి
ఆర్ద్ర హృదయ వీక్షణలై....

గంగా, యమునా, గౌతమి,
వాల్గా, డాన్యూబు, థేమ్సు,
ఒరెనాకో, నైలు, రైను,
నయాగరా, జరామాలు,
హోయాంగ్‌హో, స్వర్ణముఖీ,
యాంగ్-సీ-ఐరావతీ-
మహానదుల ప్రవాహాలు
విప్లవజనసమూహమై....

ప్రాచ్యప్రతీచీ మహోదధీ
హృదయాంతర జ్వలిత
అరుణోదయ రాగసంధ్య-
భూగోళాందోళనలో
ఆరోహిత కేతకమై,
పురోగామి దీపకమై....

విశ్వశ్రామిక హృదయం
విలపించే సముద్రమై....
త్రికాలాల ప్రభవించే
ప్రకృతిలీల విచిత్రమై :

.... ...

అనాదిలో అగ్నిద్రవ నిర్నిద్రాకృతియై,
ఘనీభావకర్కశత్వ పాషాణాంతర్భవమై ;
నిశ్చేతన నిర్జీవన నిద్రాముద్రితమూర్తై,
క్రమక్రమః పరివర్తిత జాగృత జీవనమై ;

సుప్త చలిత జనిత జ్వలిత చై
తన్యం తర్ ప్రేరిత భువిచైత్రోత్సవమై-
పుడమి కడుపు పండి నరుడు అధిష్ఠానదేవతయై ।
ప్రసవించిన వసుంధర రసాలసాల ఫలరసాలఖాదియై ।
విశ్వమహాసృష్టికి తొలిమానవుడే నేతయై ।

రోజులు, వారాలు, నెలలు, ఋతువు
లాయనాలు, ఏళ్ళు, దశాబ్దాలు, శతాబ్దాలు
తరతరాలుయుగయుగాలు లిప్తలుగా గడపి,
జగతీజన సమూహాలు కలహమ్ముల కలగి,

వసుమతీ సమస్త భాగ్యభోగాల దురాక్రమించి
దాచుకునే స్వార్థచింత జనియించిన దాదిగా-

గుంపుగుంపు నడుమ గత్తె
మనిషి మనిషిమధ్య పోరు
పరస్పరం సంఘర్షణ అనవరతు సలిపీ——

జనతా జీవనవాహిని అనంతమై అమరమ్మై
నాటినుంచి నేటివరకు నిరవధిగా గడచీ,
ముదుసలియైచిద్రుపలుగా ప్రిదిలిపోయి కృశియించిన
ప్రాతప్రపంచపు గుండెల నవనాకం వెలసీ ;
నరకలోక పిశాచాల వికారాల సుదూరాల తరిమీ,

ఈ జగాన నవసమాజ సృజనోత్సవ
సుప్రభాత కాంతిరేఖ తెల్లయెదలబరపీ ;
వర్థమాన భువిచరిత్ర నాయెదందనిలచీ,

**భూగోళపుగోళాకృతిమందస్మితచారువదన-**
**అస్మదుజ్వలాంతరంగ పీఠముపై వెలసీ :**

**దేశదేశములను రేగు మానవ యత్నాలభ్రమరి**
**నాయెద కనుదమ్ములలో రొదలులేపి కలచీ ;**
**విశ్వమహావిప్లవ గీర్వాణికేలుదోయిసోకి**
**నా శరీర సర్వస్వం పులకించెను వీణయై ।**

నవగానా లాలపించి మ్రోగుతోందిశరీరం. . .
నవరాగము మేళవించి తిరుగుతోంది భూగోళం. . .
నవజీవము మేలుకొలిపి ప్రసరించెను సమీరం. . .
నవకాంతుల రంగరించి రగులుతోంది ఖగోళం ।

[ఇది ప్రస్థావన-]

# స ము ద్ర ఘో ష

**బులుసు-జీ-ప్రకాష్**



సముద్రం
ఘోషిస్తు వున్నది,
దరిద్రం
వినిపిస్తు వున్నది,

సముద్రంకీ
దరిద్రంకీ
సామరస్యం
ఏమివుందో!

గిరిఝరం
పరిగెత్తుకుంటూ
బిరాబిరగా
అరుగుచున్నది.

జలజలా
పారేటి సెలకూ.
జలధిగళ
ఉచ్చైశ్శ్రవసులకూ.
సౌమనస్యం
ఏమివుందో!

కలకలా
నగవలయునట్టివి
తళుకు తుళుకుల
అలల నిసుపులు
కళపెళం పడి
తిరిగి పడియెడు

ఊర్మితతికీ.
సరిత్పతికీ

90

హృదయ బంధం
ఏమిటుందో !

దూరగగనా
రామసంచర
వారివాహాము
నివ్వెరంపడి
నిలిచి, అశ్రులు
ఏకధారా
ప్రవాహంగా
ఎందుకొరకో
క్రిందరాల్చును ?

సాగరోర్మిః
స్వయంవధకీ,
మేఘమాలా
మనోవ్యధకీ,
మధ్యతంత్రిక
ఏమివున్నదో !



# పాముపాట



'కనకమేదల'



నాదు హృదయ తంతువులపై నాట్యమాడ
నాటి మధ్యాహ్నవేళ నానందవశత
పాటపాడెడి పాములవాని కంటి
పాటలో మేనుమరచిన పాముకంటి.

ఎదుటనున్నది సర్పమంచెంచబోదు
ఊగుచుండెమేను మరచి నాగుబాము
వారి యజ్ఞాత గురుశిష్య భావమెంచ
నాదు హృదయమ్ములో రేగె నేదో తలపు.

ఈ విశాలరమ్య ప్రకృతియె మధురముగ
పాట పాడెడి పాములవాడు కాగ
మానవాళి మనమ్ములు వాని పాట
లాలకించెడి సర్పమ్ము లగును సుమ్ము.

ద్వంద్వ భావనామయ జీవిత ప్రవాహ
ధారనస్తిత్వ మెరుగక తరలిపోవు
విఫల వాంఛామయ హృదయులార రెండు
అస్మదీయ జీవిత గీతి నాలకిందు.

అంచు నాలపించు ప్రకృతి నాలకించి
అవి నూత్నగీతికలోని యర్థమెరిగి
విస్మృతగత జీవితులై నవీనులౌచు
మేను మరచి నాట్యమొనర్చు మానవాళి.

---

# మహారాత్రి

---

భాగి

●

భాను గర్భిణి-ఈరాత్రి-భయంకరంగా ఉంది
కొండరాళ్లు పులకరిస్తున్నాయి
మొండి చెట్లు కలవరిస్తున్నాయి
తిండిలేని జనం నిద్రా ద్రావకం త్రాగి నిషాలో ఉన్నారు.
భాను గర్భిణి-ఈ రాత్రి-భయంకరంగా ఉంది—

ఆకాశాన
మబ్బుల మెట్ట భూముల్లో

నక్షత్రాల వెండి తుంపురల చిమ్ముతూ
ప్రవహిస్తున్న రజతనదీ తరంగ డోలికల
తెప్పవేసుకొని-వళ్లుమరచి-విహరిస్తున్న
చంద్రుని మనస్సులో
ఓ నల్లని తలపు తలయెత్తింది,
తన చల్లదనాన్ని-వెన్నెల మంచుని,
దింపుతున్నాడు
ఈ భూమి
వెచ్చని నిట్టూర్పైన విడవకుండా-నిర్జీవిమై-మంచు గడ్డై
బిగిసిపోవాలని
భానుగర్భిణి-ఈ రాత్రి-భయంకరంగా ఉంది—
చిగురుటాకుల పొత్తిళ్ల గుప్పెళ్ల ముడుచుకుని పడుకున్న
పసిమొగ్గల పలచని పెదిమెలు-వణికిపోతున్నాయి
చెట్లు, భూమిపొరల్ని చీల్చుకొని
పైకి సాగిపోతూంటే.
ఎవరో ! తమ పాదాలవేళ్లను పట్టుకు లాగుతున్నారని
కొమ్మలుగా వంగుతున్నాయి
నదులు, కలవరపడుతు-నిలకడలేక-గంతులేస్తున్నాయి
భానుగర్భిణి-ఈ రాత్రి-భయంకరంగా ఉంది—
వందగజాల దూరంలోని వస్తువ కనబడటంలేదు
పొగతో కప్పబడిన బోడిగుడిసెలావుంది-ఈ భూమి.
గుడిసెలు-మేడలూ
గుడ్డిగా నిద్రపోతున్నాయి.
ఫ్యాక్టరీగొట్టాల గొలుసులపొగ

అరిపోతున్న కాష్టం కక్కుతున్న ధూమంలాగా
వళ్లుముడుచుకొని-సుళ్లుతిరుగుతూ-సొమ్మసిల్లి
బైటపడుతున్నది—
బజారు దుమ్ము పక్క వేసుకొని
కుక్కల్ని డొక్కలో పెట్టుకొని
వణుకుతూ, నిద్రపట్టక, కూర్చున్న జనానికి
ఎర్రరంగు ఉలిపిరికాగితపు మంటలువేస్తున్నారు
వీధి వీధిని—
లాభం లేదు.
చలి యెక్కువేతున్నది . .
చలి ముదిరిపోతున్నది . . .
చలే చలికి వణికిపోతున్నది . . . .
ఈ చలికి
ఈ మహారాత్రి-నిండుచూలాలి-గర్భంలోని పిండం
గడ్డకట్టుకుని పోతుందేమో నని,
తన గుండెల్లోని వెచ్చదనాన్ని
కవిత్వపు శాలువలుగా కప్పుతున్నాడు
నేటి కవి
అణు రూపి
విశ్వకవి.



# బలివితర్ది



**రాజేశ్వరీరాణి**



నా నులివెచ్చని రక్తముతో
కల్పి
చల్లిన అన్నము
బలిముద్దా ?
నీ తొలిముద్దా ?
నారక్త తైలముతో
తడిపి
నరాలు పేడిన వత్తి
నావరాల-నరాలుపేడిన వత్తి
వెలిగిస్తే
నీ ఆరాధనా ?
నా శిధిల హృదయవేదనా ?
యుగయుగక్లిన్నజీవిత గృహాశోధనా ?
జీర్ణించిన నా ఈ అస్థులు
చేసిన

అలంకరణమా నీకు
ఆభరణమా ?
నా మరణమా ?
నా గుండె నీ బండకాలికి
నా పేదగుండె
వేసిన
బలి పీఠమా ?
నీలాస్య శాలయా ?
నాశోకశాలయా ?
నా కాలిన భస్మము నీ
దాల్చు
విభూతియా ?
నా భీతియా ?
నా జీవితమంతా పేడిన పలుపు
నీ నిట్టూర్పులో ఇమిడిన పిలుపు
నా జీర్ణించిన కోర్కులు
తన గర్భంలో క్లుప్తమొనరించుకొన్న
ఈ కాల స్మశానము
నీ నిత్యక్రీడాలోల
భూత ప్రేతపిశాచగణపరివృత
బృందావనమా ?
ఈశాన ?



# పిచ్చిపాట



**మల్లవరపు విశ్వేశ్వరరావు**



పిచ్చివాణ్ణి, బిచ్చగాణ్ణి,
        ప్రేమించా లోకాన్ని
కామించా సుందరతర
        కారుణిక రసాన్ని।

నా కవితా కుంజంలో
        భీకర కరవాలందిగి,
"ఆకలి। ఆకలి।" అంటూ
        దూకి తరిమికొట్టింది।

ఆ కరవాలం పట్టిన
        రాకాసి కఠోరాకృతి
నీకూ నాకూ తెలిసిన
        లోకమే।.... అయితే,

కాకలిరుతి పాడే నా
        కంఠ దళన కార్యానికి

౨౪

ఖడ్గం పట్టిన లోకం
　　గతియేమిటి రేపు ?....

విచ్చుకత్తి విరిదండని
　　పిచ్చిప్రేమతో పుచ్చుకు
బిచ్చగాడి నా కుత్తుక
　　వెచ్చిస్తా,....అయితే,

కాలం క్రక్కిన గరళం
　　గ్రోలిన కంఠం తెగి, ఆ
భీల దవజ్వాలలు భూ
　　గోళసీమ నుడికిస్తే,

కరవాలం కరిగిస్తే :
　　నరలోకం నశియిస్తే,
నవజీవం కృశియిస్తే,
　　అవమానం కవిదే అని,....అంతే !

....　　....　　....

రాకాసికి మృదురాగాలాపన
　　రమ్యంగా లేదేమో అని
"ఘూకశ్రుతి" శోకపు బురఖా
　　నా కవితకు తొడగనా ?
తోకచుక్క "రుధిరజ్యోతి" ప
　　తాక నీడ నొడగనా ?

నలికిల మెలికల "పులికి పిలక"
ఎలికబోనులో నలగనా ? ?

.... .... ....

ఆ కరవాలం—లోకపు
భీకర ఖరకరవాలం—
నా కలకంఠం కోసం
నాలిక చాపాలా ?
తేలిక చూపాలా ?

"కరకు కత్తి [illegible]మించే
గర్విష్టికి పిచ్చా ?
కవిగారికి విభ్రమా ?
కంఠమొడ్డి పుచ్చుకో"
మంటారా ?,—మహా మంచిది,
వింటారా నాపాటలు,—
వింటే, ఓహో, తప్పక
కంఠమొడ్డుకుంటా !

మీ యొరదూసిన కరవాలం
కరి త్రాచై పడగవిప్పి
కాటేయక విన్నపాట
కలకాలపుదంటా ! !

విసకందా, తినకందా
        విస్తరి విసిరే లోకం,
కుత్తుక నరికే లోకం
        "ఘూకశ్రుతి", "తోకచుక్క"
"పులికి పిలక" తెలుగు చెలక
        మొలకెత్తించింది !—
విచ్చుకత్తి మొక్కవోయి
        విషమించింది— -
ప్రణయంలో ఉన్మాదం
        ప్రభవించింది.
సౌందర్యం చింకిపాత
        సవిరించింది.
సందులపడి ఛందం చెడి
        సకిలించింది.
కలకంఠంతో ఆమని
        కనుమొరగింది !

....   ....   ....

తెనుగు కత్తి నవకవితను
        తెగనరికింది ! ! !



# లంపటం



చిల్లర భావనారాయణరావు



నిశాదేవి దిసమొలతో
రాక్షసంగా బంధించింది,
గ్రసి తోష్ణరుధిరపానం
కసితీరా కావించింది.
విడువలేక బడలిపోయి
వెఱ్ఱిచూపులుచూచే నా కళ్లల్లోకి
తొంగిచూచింది వేగు చుక్క
ఉషస్సుందరి ముక్కు పుడక।
తూరుపు సముద్రం బాలుడు
బంగారు తండ్రి భానుడు
నా కనుల వేయి మహోదయాల
నగ్న సత్యం కురిసినా
నిశీదల వ్యసనంతో
నీరసించిన నాతో
అది అంతా విప్లవమని
అన్నది నా చిన్నది.... ....

కాళరాత్రి కంపు గుండెలో
సొంపు నింపుకొన్న నేను
మోకాళ్ల దొక్కల్లో పెట్టుక
నిద్రించా, నిశాంగనా
లంపటం సంకటమైతేనే
హాయిమనిపించగా-కాని
దివారాత్రు లొకళ్లొకళ్లని
చంపుకునెత్తురు త్రావేసంధ్యలు
నా ప్రాణం తీస్తున్న వంధ్యలు !
నేనొక దెబ్బతిన్న సిపాయినై
గాఢాందకార గగన భారాన్ని మోస్తూ
ఈ జగత్తు పొలిమేరల్లో పయనిస్తూ
దూరదూరాల నక్షత్రాల అరుపుల కానందిస్తూ
ప్రపంచం చీకటిమయమైతేనే
బాగుంటుందని భావిస్తున్నా
ఎక్కడెక్కడో కొక్కొరొకో అరుపు
వెక్కిరిస్తూనేవుంది। కాని
లంపటం సంకటమైపోవటమే చమ్మగావుంది।।



# స్వర్గానికి - నరకానికి



పురిపండా అప్పలస్వామి



లోకం కాలం నాపై
రాంబిందు దంపతులై
నా శవాన్ని
బతికుండిన నా శవాన్ని
చీల్చి పంచుకుంటూంటే
పంచుకు భక్షిస్తూంటే
నేను
నీ గుండెల వికసించిన
గులాబీల తెలివసనం
నా వొడలి నలంకరించి
నీ కెంపుల స్వప్నం నా
పథవీధిని వెలిగిస్తే
శతసహస్ర వధువులు రా
కన్నెలు నా వెంటవచ్చి
వెడలినాను విను వీధికి
పునర్వసువు నక్షత్రం

పల్లకిగా అధివసించి
శతసహస్ర శతసహస్ర
సహస్రశత వధువులతో
రారాజై అధివసించి
కిందికి పరివీక్షిస్తే
వృద్ధజగతి నా వియోగ
వేదన సయిరింపలేక
కుమిలి కుమిలి
కుమిలి కుమిలి
మూల్గుతోంది ఈల్గుతోంది
నా శవాన్ని
బతికేవున్న నా శవాన్ని
బతుకుతూన్న నా శవాన్ని
తాకబోతె తట్టబోతె
నా శవమే నోరువిప్పి
కాలాన్ని లోకాన్ని
రాంబందు దంపతుల్ని
పరపర పరపర పరపర
నమిలి నమిలి
నమిలి
మింగి
తేన్చింది
లజ్జలాంటి చీకట్లే

నల్లగ నల్లగ నల్లని
ముసుగైనవి భూదేవికి
భూదేవత కుచం మీద
నాశనం
బతికేవున్న నాశనం
వెలుగుతోంది
మెరుపు లాగ
కురుపు లాగ
వెలుగుతోంది
ఆవెలుగును చూడలేక
భయపడుతూ
పరిగెడుతూ
దివాంధాలు చస్తున్నవి
ప్రతారకులు ధనాధికులు
ప్రభువులు నరహంతకులూ
నాయకులూ దగాదార్లు
శవంవెలుగు సైపలేక
సైపలేక చూడలేక
భయపడుతూ పరిగెడుతూ
నగ్నంగా
హీనంగా
హేయంగా

నీచంగా
చస్తున్నారు
భూదేవత కుచంమీద
కుచంమీద కచంమీద
నా శవాన్ని దిగవిడిచి
చావు లేని
చావ లేని
చావబోని
నా శవాన్ని దిగవిడిచి
నా వధూ సహస్రంతో
భగవంతుడనై లేస్తాను
నీ కన్నుల నీలి నీడ
నీపాటల పసిడిబాట
నీ కలల వసంతవనం
నా పల్లకి నడిపిస్తాను
నా కన్నులు కొరవి చేసి
దివిటీలుగ వెలిగిస్తాను
వెళతా వెక్కడి కంటే
స్వర్గానికి
నరకానికి



# నాన్యః పంథా......

## విశ్వం



అదిగదిగో లోకం ఆ
ట్టడుగు చీలి నేలపగిలి
నిప్పు టేరు నింగికెగసి
నిటారుగా పారుతోంది
నిద్రమత్తు కళ్ళలోకి
క్షుద్ర పశు ప్రాణిలోకి
విద్రా వణ వహ్నిచ్ఛట
విశృంఖల ప్రవాహమై
విజృంభించి దూకుతోంది.
కాలుతున్న కడుపుపొరల
కటాహాల కంఠాలను
క్రక్కుతున్న ఆకలిపొగ
క్రమ్ముతోంది దిగంతాలు.

కళ పెళపెళ ఉడుకుతున్న
కమురుకంపు కొట్టుతున్న

కాలిన ప్రేవుల లోనికి
కమ్మని మాటలు దూరవు.
ఝుమ్మని గడియలుపడు క
ర్ణమ్ములలో కాలస్వనం
కుమ్మరించినా చేరదు.
నోటి తీట తీర్చుకొనే
మాటల ప్రోవులు విని విని
దిమ్ముపడిన మెదడుకు, వా
జమ్మ నీతిశతకాలా
కమ్మదనం చూపగలవి?

ఒక్క గంటె గంజికొఱకు
ఒక్క ఉప్పుతాయికొరకు
ఒక్క చింత పిచ్చకొఱకు
మొగం వాచినారు ప్రజలు.
ముపకాటలు పరమాన్నం
మెక్కుతున్న దండుగ రా
మన్నల బొజ్జల కొలతలు
మఱపించే మన పాటలు
ముళ్ళు పడిన నిరుపేదల
కుళ్ళిన గుండెలలోనికి
కూరలేవు సంతృప్తిని.

విను వీధిని, నెలవంకను
మినువాకను, వెన్నెలనూ

శుక పిక శారిక రవమును
సుందరీ కపోల పాళి
సుషమా లావణ్య రేఖ
చొక్కిపోయి చిత్రించిన
సెబాసనే వారు లేరు.

మత్తుమందు మార్ఫియాలు
కనుకట్టులు వాకట్టులు
యక్షిణి బగళా ముఖిలు
యంత్రబ్రహ్మాలు నమ్మరింక.

శుష్కప్రియ వాక్కుల సు
స్తిష్కంలో దాగియున్న
ముష్కరత్వమంతా—ఆ
విష్కారం పొందించీ.

పల్ల కపట మెఱుగనట్లు
పల్లించే ప్రేమగీతి
పల్లవిలో అణగియున్న
ప్రల్లదనం నల్లమందు
బుట్ట వెల్లకిల పడినది.

వంధ్యా సుత సౌందర్యం
వనతరు పల్లవ శోణిమ
ఘననీలిమ, ఉషోరుణిమ,
గానపటిమ, కళాగరిమ.

ధర్మ శాస్త్ర మర్మవేది
తర్క శాస్త్ర వాక్య
స్త నశల్య పరీక్ష ప్రౌఢిమ
ప్రాచ్య సనాతన సంఘ
స్వ కుచమర్దనం కూడా
వినరు వినరు ప్రజలింకను
విని విని విసుగెత్తినదీ.

నిషా పెంచు నినాదాలు
విప్పచ్చర మణచలేవు.
నిస్సత్తువ తీర్చలేవు,
నీరసం వదల్చలేవు
నిత్య దరిద్రుల కేటికి
నీరస వాదోపవాద
ని గూహానం ?—
నిజాయితీ
శంకించే దశ వచ్చెను.

నీ—నా మాటల మధురిమ
నీ—నా చేతల విసమున
నిమగ్నమై పోయినదిక
నీ రవ జనతే తెగించి
నీల్గి మూల్గి నిలుచున్నది.

ప్రజా వాహినీ ప్రగతిని
వారకపుల్ల లాపలేవు.

భయం వదలి
భద్రతకై
సాగుతున్న
జనతండం
నీ—నా మాటల నమ్మదు.
నీ—నా గుండెలలోనికి
నిశితంగా చూడగలదు.

సత్యదీక్ష నిజాయితీ
జన యోగక్షేమ చింత
కనబడితే—
పిలుస్తారు
కలిసి—
నడవమంటారూ.

కట్టి కొఱుకు క్రౌర్యం, వం
చనల్ కించిత్తో
కనబడి నా—
నిన్ను, నన్ను
నలగి ద్రొక్కి
ముందునకే
సాగుతుంది
జనతాగళి
ఆగబోదు
ఆగబోదు
ఆలోచించుము సఖుడా!

నాశనమో—

నవశకమో—

నాన్యః పంథా నేస్తం।

అటో ఇటో తేల్చుకొమ్మ

ఆట్టే ఇక వ్యవధిలేదు।

"నాఽన్యః

పంథా

విద్యతేఽయనాయ".

---

# ఏకత

---

కవి రాజమూర్తి



తోటమాలి బలిదానం చేస్తేనే
పువ్వులు పరిమళాల నీసగలవు
మానవుడు కలవాలి మానవుణ్ణి
తిడితే ఏంలాభం కనుపించని దేవుణ్ణి
ఆకాశానికి శోభ చందమామ
మిణుగురుతో విద్యుత్కాంతులు ప్రసరించవు
మారాలి నేటి నాటువ్యక్తి
కాకుంటే లేదెన్నటికీ విముక్తి

మానవునికి మానవుడే ధ్యేయం
మానవత్వమే మానవజాతికి శ్రేయం
చరిత్రలు మన ఉనికికి కావు ప్రమాణం
ధరిత్రిని వెనక్కినెట్టి వేయాలి ప్రయాణం
మనం కోరే క్షణం శాంతి
జగత్కల్యాణానికి కాదు క్రాంతి
మన కాళ్లలోని బొబ్బలు
దౌర్జన్యానికి చావుదెబ్బలు
ఆకాశంలో ఎగిరే కీరం
ఎల్లప్పుడు తిరిగే గోళం
మధుర గీతికలు పాడే గళం
విశ్రాంతిని కోరవు నిజం
యుగయుగాల నైరాశ్యం
మన బ్రతుక్కి యమపాశం
తరతరాల ఈ శాంతం
మనజీవిత ఆసాంతం
అడుగు అడుగు కదలికలో
అవనీ గర్భం కంపించాలి
మన కన్నులకాంతి ప్రసరణతో
కాలగమనం క్షణమాగాలి
అన్నలూ
చేతుల్లో చేతులు కలపండి
విశ్రాంతిని విసర్జించి నడవండి.
అక్కలూ
అహ్లాదగీతిక లాలాపించండి

ఆనందంతో కందళిస్తూ కదలండి
మనఅందరి ఏకత్వం
పృధ్వికి నవ్యత్వం
అన్నలూ విన్నారా ?
అక్కలూ విన్నారా ?
ఉదధినీరు అంతటా ఉప్పే
మండేమంట అంతటా నిప్పే
ఆకలికి అన్నంకోరడం ఒప్పే
దౌర్జన్యం ప్రతిదేశంలో తప్పే
నిర్వీర్యత ప్రాణానికి ముప్పే
సప్తరంగుల సంఘమమైనా
ఇంద్రధనుస్సు ఛాయఒకటే
ఏడురంగుల కూడికఐనా
భానుకాంతి తెలుపే
రంగులు వేరైనా నరజాతి
నరంగు మానవత్వమే
చంద్రికలను వెదజల్లే చందమామ నలుపైనా
చంద్రుడు నలుపని మనమనగలమా ?
రంగులు—జాతులు
కాపు మనకు జ్ఞాతులు
కుండలు వేరైనా
మృత్తిక ఒకటే
కొమ్మలు, రెమ్మలు వేరైనా
ఏకవృక్ష భాగాలే

మనమంతా మానవులం
కలయికలో ఉంది బలం
మనలో మన చీలిక
మన పతనానికి ఏలిక
మనలో మన చీలిక
మృత్యుదేవికి నాలుక—

# కాళరాత్రి

కనపర్తి లక్ష్మీనర్సయ్య



దీర్ఘంగా నిద్రిస్తూంది కాళరాత్రి :
దిన మహస్సు కనువిప్పలేదు.
వీధుల్లో పెనుచీకటి
వెలుగును వేటాడుతుంది.
దీప స్తంభాల క్రింద
దీనాలాపనలెన్నో
నీడలతో పయనిస్తున్నై
నిద్రాభారానికి లొంగక :
దీపకళిక పెదవి విప్పి
దీనజనుల శయ్యలపై
తేనెవాన చిలుకుతుంది.

శ్మశానం రెప్పవాల్చక
చిచ్ఛదృక్కుల చిమ్ముతూంది.
గోడలపై ముసుగుమనిషి
నీడలు పరుగిడుతున్నై--
ధనాగార హృదంతరం
వణుకులెత్తి మూల్గుతుంది.

---

# పొ లి మే ర లు

మాదిరాజు రంగారావుగారు



'ఎంతదూరం అర్ధరాత్రి నీ నడకలు'
'సముద్రతీరాలు దాటి, ఆకాశపుటంచులు దాటి
పాతాళం లోతులదాకా'
'అదే అదిగదిగో ఉదయభానుని బింబం'
'కాదుకాదు ప్రళయకాలుని దండం'
'అవి విదళించే ఎఱ్ఱని గులాబిరేకులు'
'ఇవి విదళించని ఎఱ్ఱని హృదయాబ్జపురేకులు'
'ఇది విశాల విశ్వాన్ని పాలించే కిరీటం'
'కాదు విశాలహృదయాన్ని గాలించే కృపీటం'
'నీ కపోలాలపై కదలుతూన్నవి ఛాయలు'

'అవును'—'నా హృదయాంతస్సులో నర్తించే
మృత్యునర్తకి ప్రచ్ఛాయలు'
'అర్ధరాత్రి—'
'నిశాంగన యొడిలో నిదురించి
ఎవరో కలవరిస్తున్న శబ్దం'
'కాదుకాదు
నా శబ్దాల అడుగుజాడల నంటిపయనించి
శతాబ్దాలక్రిందటి మనమాటలు
ఎవరో ? ఎవడికో ? చెప్పుతున్న శబ్దం'
'కప్పుతున్నారు మనకు మసక తెరలు'
'ఎప్పుడో నేనైనా విన్నమాటలుసుమా ! ఇవి'
'ఎంతకాలం ?
ఈ శిధిల హృద్వీణా తంత్రీనాదాలు వినటం'
'నీవూ నేనూ శశ్వచ్ఛంతినొంది నిమరించేదాకా'
'కదలని నీడల్లో ఏదో కదలిక !'
'వదలని నీడల్లోకి జీవరేఖల పయనం'
'మనం వదలిన మేడల్లో జాగృతి
మనం కదలని నీడల్లోనే మన ఆకృతి.'



# నాగి

'పుట్టపర్తి'



గున్న మావిచెట్టు క్రింద
తెన్నులరసి-కన్నులలసి
కూలి కేగినట్టి మామ
పోలికలే—తన కనులై
        కూరుచుంది వలపు 'నాగి'
'నాగి' జూచెనంటె 'మామ'
నవ్వుల చెండై పోవును
మామ ముద్దు నాగి మదికి
మరులు తీగె మెట్టినట్లు
కడికిలేదు-కట్టలేదు
కూరుచుండ గుడిసెలేదు—
అయినా వారిద్దరికీ
అనురాగం కొఱతలేదు—
చందమామ వెన్నెట్లో
అందమైన సంసారం
చందమామ లేని రేల
సరసాలే ఒకదీపం—
కూలి నాలి చేయు నప్పు

దాలినగవు ప్రోలనిలచి
అయిదింతలు తనబలమై
ఆ మామకు—ఉత్సాహం
ఎన్నడైన తన్నువిడచి
కన్ను మూయలేదు మామ
మామ నేడు రాలేదే
మంటున్నది-వలపు 'నాగి'.

కూలి డబ్బు లివ్వలేదొ !
గింజలేమి దొరుకలేదొ !
నాగిమనసు యిక్కట్లై
మూగివచ్చె చీకట్లై

ఈల వేసికొనుచు వచ్చి
పోలీసొక్కడు చూచెను
వెన్నవంటి వెలఁది సొగసు
కన్నులలో కలల తళుకు—

కన్నుగీటి నిలచినాడు
వాని జూడలేదు 'నాగి'
మనసంతా మామ తలపు
లినుమడింప—తనుదానై

దగ్గరించి జవానపుడు
బుగ్గల నంటెనొ లేదో !
బుసలుకొట్టు కోడెనాగు
కసరించెను వాని 'నాగి'

అదరు బెదరు లేమి లేక
మదమత్తుండా జవాను
నాగి రెట్టబట్టి యీడ్చి
నాచికొనియె యెద అందం—
'ఓ మామా' 'ఓ మామా'
ఓరంతగ అఱచె 'నాగి'
వారు వీరు చేరులోన
వాదేడీ! దుసికినాడు—
రేయి యెల్ల మామకొఱకు
వాయి విడచి యేడ్చె 'నాగి'
తనమానం చితికె నంచు
తల్లడిల్లి తలరె—'నాగి'
కోపము దుఃఖము జమ్మై
కుసిలి కుసిలి యేడ్చె 'నాగి'
కన్నీరే కాలువగా
గున్న మావి నించె 'నాగి'
వేవినంత మామ తెరువు
వెదుకబూని వెడలె 'నాగి'
మామ జైలు కటకటాల
మూల్గుతూండె దెబ్బలతో—
దొంగతనము చేసెనంచు
త్రోసినారు బందిలోన
మామజూచి నాగి మనసు
మరులే నీరై పారెను—

# ఆకాంక్ష

గర్రెపల్లి సత్యనారాయణ



నా చేత భావాల పూలమాలికలల్లి
ఈ లోకమునకీయనా—మాలినై
మూల మూలల నమ్మనా.

బ్రతుకు బాటలలోన పరుగెత్తు సాహితీ
సతి కొప్పు సవరింపనా—అందాల
నతికించి ముడిపెట్టనా

తీయగా పాడుకొను గాయక భ్రమరాల
తేనెనై పలపింపనా—రాగాల
దేలి యానందింపనా

శ్రామికుల వేడినిశ్వాసలు సుగంధమా
శ్వాసింపగా జేయనా—హృదయాలు
శాంతింపగా జేయనా.

ప్రణయ జీవుల కోర్కె బండించి కళ్యాణ
భాగ్యమే కలిగింపనా—సౌఖ్యాను
బంధమే వెలిగింపనా—

# గట్టు!

పి. గణపతిశాస్త్రి



గట్టుమీద ఉంటే నీకేమి తెలిసి
నట్టు లోతు ! వట్టిమాట ! నేస్తం ! రా !
అట్టడుగు సముద్రంలో
కంటా పురి మునిగిచూడు !

ముసుగు దుప్పటీలో నీ అలసతకే
వశమైతే—వద్దు హాయిగా పడుకో !
వద్దు నాకు లేనిపోని
పెద్ద బెడద ఏలనుకో !

కానీ, నాదొక్కమాట ! ఒకేమాట !
ఏనాడో హఠాత్తుగా నీ కట్టిన గాలిమేడ,
మొదలంటా కూలున్ ! నీ
ఎద పిడుగై కాలున్ !

తియ్యని నిద్దరకల లోతుల్లో రయి
రయ్యమనే హోరుహూరు మ్రోగెనదే !

అయ్యయ్యో! అన్నా! లే
వయ్యా! ఉరిమింది! జలధి!

ముసుగుతన్ని పడుకున్నావంటే బుస
బుస పొంగే ప్రళయమాగిపోతుందా?
మందరగిరిలాసంద్రం
మధ్యంలో ఉరికిచూడు!

అట్టడుగు సముద్రం బుర
దానలమే మట్టి చూచి అంటున్నా! వట్టిమాట!
గట్టుమీద ఉంది తెలిసి
నట్టిబ్రదుకు వట్టి మాట!

## చీకటి బొమ్మలు

'సంపత్కుమార'



వెన్నెల వెలుగుబాటలలో
విహరించే చీకటి బొమ్మలు
ప్రాణంవున్న శవాలట!
పరిధానంలేని జీవాలట!

మలయానిల తరంగాలలో
మలగిపోయిన బ్రతుకుపూవులు
వాసనున్న కాగితాలట :
భాషతెలియని గీతాలట :
ఉషోరమ్య కాంతులలో
ప్రసుప్తి పొందిన మనోవీణలు
స్వరమున్న మూగగొంతులట :
పరిసరంలేని రోగిరంతులట :
అమావాస్య చీకటిలో
ఆవరించిన రావాలు
బలంపున్న పరాగాలట :
పరిపంథిలేని స్వర్భాగాలట :



# రొండవా రోకళ్లు



'ఆరుద్ర'



విను విను విను
విను రూపాయల డెక్కల ధాటి విను
సిపాయిల క్రొన్నెత్తుటి ధారల
తుపాకుల కత్తులపై చారలు  కను

సరి సరి సరి
ఉరికంబాలకు మన ఆశయాలు బలి
రాంబందుల రాజ్యంలోపల
ఆంబోతులే అమాత్యులు కదామరి!
పాలితుల మెదళ్లకు దళ్లు కట్టి
వాళ్లచూపు దారిలో కాపలావాళ్లని పెట్టి
వాళ్ల కళ్ల కిటికీలు మూసి, మేకులు కొట్టి
పరిపాలించబోతుంది రేపటి రాజ్యం
మొరలాలించడం అందులో పూజ్యం
ఆశయాలకోసం అసువులు బలిచేస్తున్నా
మిప్పుడు
అసువులకోసం ఆశయాలు బలిచేస్తా
మప్పుడు
అప్పుడు ప్రతిఒకడూ ఇంకొకడికి కార్బను
కాపీ
అప్పుడు ప్రతిఇంట్లో శవం లేచినట్లు
మరిగే నిశ్శబ్దం
వైతరణికి చెలియలి కట్టలుకట్టి
రైతులను పండించమంటారు వ్యధ
పద దానివల్ల తీరుతుందా క్షుద
పద పద పద.



# చీమలబారు

పొట్లపల్లి రామారావు



ఓహో! మీరెక్కడికి
ఓ చిన్ని చీమలార
ఏ సీమకు మీరేగెద
రీతీరున బారుగట్టి?

ఎక్కడికి! ఎక్కడికి?
ఈ సమూహమెక్కడికి
కయ్యానిక, వియ్యానిక
అయ్యారె! మీరేగుట?

ఒకరివెనుక ఒకరు మిగుల
ఓరిమితో పోయెదరు
ఎవరోయి మిము నడిపెడి
యింగితజ్ఞు లింతఘనులు!

ఎవడో ఒక నేత లేక
యింత కట్టుదిట్టముగా
మనుషులమె నడవలేము
మరి మీ పోకడచిత్రము

పనిపాటలు లేక మీరు
పొర్లుపూరి తిరగడహో !
ఎక్కడిది ఈ ధాన్యము
ఎవరిళ్లకు లఃఎగుమతి ?
ముదిమాన్యము లేదుమీకు
మరి ధాన్యము సమకూర్తురు
కల్లము కొకగింజమైన
కాపె కొల్లలు, కొల్లలు
ఏ ఏ పొలముల తిరిగి
ఈ ధాన్యము గూర్చితిరి
ఎవడుచూపె కడు దుర్గమ
మైన బ్రదుకుబాట మీకు

ఈ వివేక మీ పొదపు
ఎటనేర్చితిరో కాని
ఈ శిక్షణ మనిషికున్న
యికలేములు ఎక్కడివి ?
ఎవరివద్ద చదవకనె
ఈ విద్దెటు నేర్చితిరి
కోటివిద్యలైన తుదకు
కూటికెగద మాకైనను
ఏమేమొ నేర్వదలచి
ఎటకెటకొ పోయెదము
కళ్లముందు ఎపుడు తిరుగు
ఘనుల కానలేముగదా.



## చెణుకులు



'జయంతి'



జీవితమే
జీతానికి
పనిమనిషై
ప్రవర్తించె.
జీవితమే
యంత్రానికి
పనిముట్టయి
కట్టుబడెను.
ప్రతినిత్యం
బ్రతకటమే
ప్రత్యేకత
అనిపించెను.
జీవితమే
వెట్టిచేయ
తాకట్టయి
వట్టిపోయె.
ఒకతీరని

సమస్యగా
జీవితమే
అవతరించె.
విగతమవక
మగతవీడి
జీవశక్తి
యెదురుతిరిగి
నడుస్తోంది.

.... .... ....

బ్రతకాలంటే
ధర పెరిగిందోయ్
పెరిగే ధరలలో
బ్రతుకు విలువయే
పడిపోయినదోయ్
చీకటి బజారు
వ్యాపారములో
బ్రతుకుస్వలాభం
గడిస్తువున్నది
లాభంతీయగ
బ్రతుకపహరణే
జరుగుతువున్నది.
ధనాశాపాశ
దిగ్బంధనలో

బ్రతుకు పూపిరే
తెగిపోతున్నది
ఉరిలో, బ్రతుకే
ఒరిగిపోవునో
ఉచ్చు త్రెంచుకొని
ఉద్గమించునో ?
కాలగళంలో
నినదిస్తున్నది
మానవత బ్రతుకు
సమానత కొరకు

....    ....    ....

కృషి జేస్తూ
కృశియిస్తూ
నశిస్తున్న
జీవానికి
వికసించే
అవకాశం
శుష్కమయ్యె-
కొనసాగెను
బ్రతుకు హక్కు
దొంగతనం-
బ్రతుకు చెరలో
నిరుపేదే
అపరాధై

చిరకాలపు
ప్రవాసిగా
పడియుండెను—
చెరవిముక్తి
బడయుటకై
తిరుగుబాటు
చేయుటకై
కదలికయే
మొదలయ్యెను
చేతులన్ని
జతజేరెను

.... .... ....

అగుపించిన
ఉదయ కాంతి
మరుగయ్యెను—
ఆశించిన
మార్పురాక
ఆశయమై
శయనించెను—
ఆదర్శమె
అదృశ్యమై
స్వప్నదృశ్య
అవలోకన

మైపోయెను—
తలపించిన
నవజీవం
మొలకెత్తక
మ్రోడయ్యెను—
గతంరూపు
మాసిపోక
ముసుగువేసు
కొని సాగెను—
కలలు గన్న
స్వాతంత్ర్యం
కలుషితమై
ముకుళించుకొ
పోయినదోయ్—
స్వాతంత్ర్యపు
జీవకళలొ
కళంకమును
పెకలింపక
పవళింపదు
జనావళియె.



## "ఏ రు దా టి స్తా.........."

కొనకళ్ల వెంకటరత్నం



ఏరుదాటిస్తా మనసున్నదానా
నా
కేమిస్తువే సాహసమున్నదానా
.... .... .... .... .... ....

కోయని వారి పిలుపేనా,
ఓయని వాక పలుకేనా,
చాలునులే, నేటి, కంత
ఏనుమానము లిస్తిపంచె
ఏరుదాటిస్తా.... ....

వారిగెనులే సందెప్రొద్దు ;
వరదహోరు భయమెవద్దు ;
సూపుమేర దూరములో
ఆపదరెవ రిద్దరమే
ఏరుదాటిస్తా.... ....

బల్లకట్టు మూసిపెట్టి
పడకేసిందులె సరంగు ;
ఔనను మొక సిటికలోన
అద్దరి జేరుస్తానిక.
ఏరుదాటిస్తా........

తుళ్లింతల యేటినీటి
తుంపరయిన సోకనివను ;
చెదరనీను కపుగిట నీ
సిగపూ గమగమలైనా
ఏరు దాటిస్తా........

కోరడి మలుపునలేదూ
కూచున్నా తోటమాలి ;
ఎల్లేసిన మైలురాయి
ఎందుకె నీకంత బెదురు
ఏరుదాటిస్తా .......

మాటిస్తా నీసారికి
మోట సరసమాడనులే
వొంటరి నీ మనసు గుట్టు
వ్వూరిక మోగిస్తు నంతె.
ఏరుదాటిస్తా........

చిరునవ్వులు సెదరకుండ,
సిగ్గువొరలు చీలకుండ,
తేలిక ముద్దొకటీవే
వాలు కనుల వగలాడీ ! !

ఏరుదాటిస్తా.... ....



# నీవు నేనూ కలిసి



'స్వామి'



నీవు నేనూ కలసి
నిఖిల లోకాలలో
నవవిప్ల వోంకార
రవము దిక్కులునింద
చెవిటి చెనటుల ఉక్కు
చెవులుగింగురుటోవ

న్యాయ శంఖమ్ము పూరింతాము
హోయ శోషణను శాసింతాము.

నీవు నేనూ కలసి
నీ రాజనము నెత్తి

దుఃఖాంధ కారాన
త్రోవ గానక కుందు
అసహాయ దళిత మా
నసములుద్దీపింప
        శాశ్వతజ్యోతి వెలిగింతాము
        శఠ వృత్తులను మాపివేతాము

నీవు నేనూ కలసి
నిశ్చయమ్ముగ నిలచి
ధరలోన ధ్వనియించు
ధర్మ సిద్ధాంతాలు
సంస్కార శాసనాల్
సత్కర్మ బోధనలు
నిరుపేదల బిగించు
చరిత్రాతిపురులంచు
        చెవినిల్లు కట్టుకొని చెప్పదాము
        చెవటిగుండెల నీరు చేతాము

నీవు నేనూ కలసి
నెత్తురుల్ చిరజిమ్మ
పూర్వేతి హాసాల
పుక్కిటి పురాణాల
        కడుపు చిచ్చున కాల్చివేతాము
        కాలదన్నుచు సాగిపోదాము.

నీవు నేనూ కలసి
నిర్వీర్యమౌ నీచ

నీతులను పాతమార్చి
నిస్తేజ హృదయాన
నిప్పు కణికలనింపి

నవచరిత్రకు నాంది వేతాము
భువిని స్వర్గమ్ముగా జేతాము

నీవు నేనూ కలసి
మానవత మృగ్యమౌ
ఆస్వర్ణ సౌధాల
ఆకాశ హర్మ్యాల
మదమత్సరాల జ
న్మస్థాన భవనాల
నావహించినయట్టి
ఆశాపిశాచాల

గూల్చి కుమ్మరవాము చేతాము
క్రొత్త బాటలను చూపింతాము

నీవు నేనూ కలసి
నిస్సహాయుండౌచు
కనుగ్రుడ్ల నెత్రు చు
రక్కల గ్రుక్కుకొనుచుండి
వికల మానసముతో
విలపించి విలపించి
మూపుపై కాపురపు
మోపు మోయగలేక

నదము నుగ్గైపోవ
నడువ సత్తువ లేక
పండు వెన్నెలవంటి
పంటలను పండించి
ధరణి కన్నము పెట్టు
దాత దైన్యస్థితిని
విట్టువీగుచు చూచు
పొట్ట ఘాతాలకిక
ధర్మ పన్నాలతో
దయ జనించదు గాన

హుంకరించుచు ఉద్యమింతాము
పుంకు పోకడల నిర్జింతాము

నీవు నేనూ కలసి
ఈ విశ్వమందెల్ల
విధి విధానంబనుట
వెట్టి వేదాంతమని
స్వసహాయమందె స
ర్వము నిర్భరమ్మంచు
దేహియని దరిజేర
తిట్టి తరిమెడిలోక
పరిపాటి గమనించి
భ్రాంతి భగ్నమొనర్చి

గుండె రాయిగ జేసి
కొని నిల్చి పోరాడు
నట్టి నేరుపు నేర్పివేతాము
జెట్టి దిట్టలను సృష్టింతాము.

నీవు నేనూ కలసి
నిరుపేదయైని దా
నిస కాదు కాదంచు
కష్టించు కూలి. కు
క్కయు కాదు కాదంచు
బ్రతుకు పోరాటంబు
భ్రమకాదు కాదంచు
క్రాంతిమార్గమ్ము క్రౌ
ర్యముకాదు కాదంచు

నగ్నసత్యము నూరిపోతాము
భగ్నజీవుల నుద్ధరింతాము

నీవు నేనూ కలసి
నిర్బంధ నిర్భేధ
నిర్ఛిద్ర నిష్ఠతో
నిఖిలాశయావాప్తి
నెఱిమీఱ నెగడించి
నిర్భీత నిర్ద్వంద్వ
నిర్వాప్య నిజశక్తి
కాలవాహిని కడ్డువేతాము
నీలనీరధులమై నిలుతాము.

# నిత్య సత్యాలు



పన్యాల రంగనాథరావు



చీకటి వెలుగుల తేడాలు తెలీని
జీవులంతా లేస్తున్నారు లే,
ఇదే వస్తున్నారులే।
కాయ కష్టాలన్నీ
సుఖ దుఃఖాలెన్నో
కాలానికి విడిచిపెట్టుకున్నారు
మేలుకొంటున్నారు-ఈ నాడు
మేలుకొంటున్నారు
మేలు కోరి వస్తున్న సుఖిజనికి
హారతి పడతారంతా,
స్వాగతమిస్తారంతా.
ఆకలి దప్పులు వేస్తున్నప్పుడు
మబ్బులొచ్చి వర్షిస్తా యని
భూగర్భం లోంచి పైరులు తలెత్తి
పచ్చ పచ్చగా నవ్వుతాయని
మంచి మంచి రోజులు గంటలు

ఎంతో దూరంలో లేవని
గుర్తిస్తున్నారు తమకు
వర్తించుకుంటున్నారు.
మనిషి చేతిలో కత్తులగుత్తి
ఝళించదు స్వార్థ సంపత్తి
కండరాల రాపిడిలో చెమటకు
మండదు ధన రాశి తాపం తుదకు,
నిర్బంధపు సోమరితత్వం శతృత్వం,
నిష్ఫలమయ్యే శ్రమలూ దమలూ.
పీడితులైనవాళ్లు బలికాబోరేమో
కాలానికిదే ఫలితం
పాడుకుంటారు
ఆడుకుంటారు
అర్థాకలిలో కిరకిరలూ
వ్యర్థ ఘోషలూ, ఆత్మహత్యలూ.
అల్పాయుర్దాయాలూ
బాధలతో నిండిన కథలూ
నిన్నటి అరణ్య రోదనలే.
మొన్నటి హిరణ్య వేదనలే.
అన్నింటికీ ఇస్తున్నారు తిలోదకాలు
ఆనందం పూచంటున్నారు
ఆహ్లాదం మేమంటున్నారు
శాంతికి మాకే హక్కంటున్నారు

కాంతులు మాలోనివంటున్నారు.
తరతరాలుగా హింసలలోపడి
ధారుణిలో నలిగిన విప్లవ
చైతన్య గాథ నవ చరిత్రలో
సాధించిందిలే అమరాధ్యాయం
శోధించిందిలే సత్యం నిత్యం.

---

## వసంతం

---

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి



ఆకుపచ్చని కోరికలతో
        లోకమే పులకించెనే—
కోకిలమ్మ గళమ్ములో మధు
        కోశములు విడబారెనే....     ॥ఆకు॥

మొకరి తుమ్మెద ముకుల శంఖము
        సకలదిక్కుల మ్రోగెనే—
వకుల సుమ సందేశమేదో
        నిఖిలజగతిని విరిసెనే     ॥ఆకు॥

పాలవెల్లుల కడుపుపంట
        పూలవెన్నెల పరచెనే—
పడుచుటెడదల పొడుచు ; తీయని
        భావమేదో గిలిగింతగా     ॥ఆకు॥

---

# కొత్త పాట

భాస్కరభట్ల కృష్ణారావు



ఇక
నే పాత పాటే పాడనా ।
అరిగి,
నే పాత ఆటే ఆడనా ।।
లోకులంతా వొళ్ళుమరిచీ,
లోకమంతా సుళ్ళుదిరిగీ
నింగినుండీ ఫెళ్ళు ఫెళ్ళున
నిప్పు కణికలు విసురుతుంటే
పాత ఆటే ఆడనా ।
ఇక,
నే పాత పాటే పాడనా ।।

.... .... ....

దప్పియంటూ తల్లడించీ
ఆకలంటూ అటమటించీ
శోషపోవుచు, స్రుక్కితేలే
మానవాళిని మరిచిపోయీ

పాత పాటే పాడనా ।
ఇక
నే పాత ఆటే ఆడనా ।।

.... .... ....

లోకమంటే లోతుదెలియని
వెలుతురంటే వెలుగుతెలియని
మాతయంటే మమత తెలియని
మారుమూలల క్రుమ్మగ్గునట్టి
మానవాళిని మరిచిపోయీ
తిరిగి
పాత పాటే పాడనా !
ఇక,
నే పాత ఆటే ఆడనా ।।

.... .... ....

లోకమంతా కళ్ళు తెరచీ
లోకులంతా వళ్ళు విరిచీ,
పరుగు పరుగున పరువులెత్తుతు
పగలు రేయీ సయనమవుతే,
ఇక,
పాత పాటే పాడనా ।
నే పాత ఆటే ఆడనా ।।

... .... ....

చెట్టపట్టాల్ పట్టుకోనీ
దేశదేశాల్ వెళ్లుతుంటే
నామదేశము నడకమరిచీ
అలసి సొలసి సూయితుంటే

తిరిగి.

పాత పాటే పాడనా ।

ఇక.

నే పాత ఆటే ఆడనా ।।

జగతినంతా మహాప్రళయం
ముల్లుముల్లున నలుముకొంటూ
విశ్వసృష్టికి దారితీసను
విలయతాండవ మదిగో, అదిగో

ఇక.

నే పాత పాటే పాడనా ।

తిరిగి,

పాత ఆటే ఆడనా ।।



# వీరేశలింగం

గిడుతూరి సూర్యం



అతడొక సాధారణ మానవమాత్రుడు
అతడొక మహానుభావుడు
ఆంధ్రమాత నోములపంట!
అతనంటే సనాతన జగత్తుకొక సింహస్వప్నం!!
తరతరాలు నాటుకొన్న
సంఘ దురాచారాలకు
అతడే తొలి గొడ్డలిపెట్టు!
అజ్ఞానం, అవిద్య
మూఢనమ్మక పిశాచాలకు
అతనొక మాంత్రికుడు :
సంఘ సంస్కార సంఘర్షణలో
విజయ ధ్వజమెత్తిన విప్లవ మూర్తి!
మనిషికి మనిషికి తేడా కల్పించిన
కులభేదాలను మొదలంటగ ఛేదించి
భావంలో అభ్యుదయం
భాషలోన క్రొత్తదనం
నెలకొల్పిన జగజ్జ్యోతి!

కూలిన వటవృక్షాలకు
ఆకులు తొడిగిన నిత్యుడు !
చీకటిలో వే వెలుగై
వెలుతురు విరజిమ్మినాడు !
అఖిలాంధ్రకు కన్నాకై 'కందుకూరి'
భావి పథం చూపినాడు !
సుమనస్కుడు ; పలుకు పలుకులో
తేనెలు కురిపించుతాడు ?
అక్రమాన్ని ఎదిరింపుతు
దాకుల మెటుపుల విసరును !
అతడొక సాధారణ మానవ మాత్రుడు
అతడొక మహానుభావుడు !!!

---

# నూతిలో గొంతులు

'బైరాగి'



రాత్రి !
కాళరాత్రి !
కరాళ కాల రాత్రి !
ఆదిమ తమస్సులు ఆవరించినయ్ ఆకాశాన్ని

అవనిని, అనాథ హృదయాన్ని
కప్పేసింది కాటుకచీకటి మంచు
ప్రళయోన్ముఖ పురాతన ప్రపంచాన్ని
శబ్దంలేదు
గాలిలేదు
చీకటి లేదు
జాలి లేదు
రూపు లేని
చూపు లేని
రేపు లేని
మాపు లేని
ఈ గడియను
ఈ నిముసము
చొరనేరని
చెర, కుబుసము
మన్ను తిన్న దానిలా
మన్నులో పొరలుతోంది
కాలాభీల కాలవ్యాళం
పడిపోయిన ఇంటికి
చెడిపోని తాళం
ఈ చీకటి ఈ నిముసం
నిర్దీపం, నిర్గంధం
పసగం, రుచిలేని రసం
విరిగిన వెన్నెముకల చందం.

రాత్రి నిదుర బోతోంది
ప్రపంచం నిదురబోతోంది.
ప్రపంచపురాత్రి నిదుర బోతోంది.
నిదురబోతోంది వీణ
గాయకుని గొంతుక
నాట్యగత్తె నల్లని వేణి
కరుణ చరణాలు
చరణ మంజీర క్వణనాలు
శిథిల భుజపాశాలు
ఉన్నతి పక్షంలో ఉఛ్వాస నిశ్వాసాలు
నిదురబోతున్నాయి గుండెదడలు
కాంతకననికల్లో కాంతుని
కాంతుల కలలు
సకల కళల కలలు
నిదురబోతున్నాయి వాడిన పుష్పాల్లో ఆశలు
మొగ్గల్లో నిరాశలు.
ముళ్లల్లో హెచ్చరికలు
కీచురాళ్ల నిశ్శబ్దపు గుటకలు.

రాత్రి పలవరింతలు వినిపించవు వాలిన ఆకుల్లో
చెరిగే భాగ్యరేఖలు కనిపించవు చిరిగిన రేకుల్లో
చేతులు చదివేదెలాగ
చీకటికి చలనం లేదు
లక్షల నక్షత్రాలు, సూర్యచంద్రులు.

మానవ మేధస్సులో మొగ్గలిడిన సిగ్గరి మిణుగు
వెలుగులు
నిగ్గుగల మెరుపు మెరుగు, రైళ్ళ, ఓడల దీపాల
పరుగులు.
ప్రశాంత కుటీరాల నిశ్చల దీపకాంతులు
చిత్తడి నేలలో కదలి కదుపున
వినీల భాస్వర కాంతులు
చంచల నయన కాంతులు
ఎన్నో ఉన్నాయి కాని చీకటికి చలనం లేదు.
చరిత్ర చిహ్నాంగా చక్రాలు
విరిగి పడిఉన్నాయి త్రోవనిండా
ముళ్ల పొద నలంకరించింది జండా.
ఒకదాన్నొకటి మ్రింగేశాయి—
ప్రవేశప్రస్థానాల అడుగుజాడలు
తుప్పుపట్టాయి కత్తులు అట్టికాడలు
ఎక్కడ పన్నీటిబుడ్లు ?
భూగర్భ నాగరికతల గురుతులు మురుగుదొడ్లు.
ఎక్కడున్నాయి రోమ్, బెబిలోన్, ఇంద్రప్రస్థం ?
దస్తావేజు లేనప్పుడు దస్తూరెలాగ స్వహస్తం ?
అంధకార సాగరంలో
పయనించిన ఓడల గురుతులుండవు.
వల్లకాటి వాకిట నాటిన చెట్లు పండవు
చివరకు చీకటొకటే, చలనంలేదు చీకటికీ.
హేమంత వసంతాలు
ఆద్యంతాలు

'కొంతలు' 'సొంతాలు'
ఎరుగని తమస్సులకు
లేవయ్యా ఉషస్సులు
పరిపంచపు పొగగొట్టంలో
కాలంరాజిన మసిలా
బహిరంతర దిగంతాలు
ఆవరించిన ధ్వాంతంలో

రుజువెక్కడ ?
వెరువెక్కడ ?
ఆదరువెక్కడ ?

ఈ నల్లని ముసుగులో దాక్కున్న దెవరిముఖం ?
ఈ చీర చెరగుచాటున దాగిన దే హృదయం ?
ఈ శూన్యావరణంలో ఏమున్నది స్పర్శసుఖం ?
త్రోవ తెలియలేదు, ఎటున్నది ఆలయం ?

చీకటి నాడి ఎక్కడ ?

చీకటి నాడిదొరికితే తెలుస్తుంది నాకు
గంటల జాడ పలికితే తెలుస్తుంది త్రోవ నాకు

కాని ఈ చీకటిలో వాకిటిలో
ఏముందో ఎవరికెరుక ?

అక్షరాలు కనబడని సిరామరక
నాగరిక ప్రపంచపు భీకర కాననంలో
మహాజన సమ్మర్దపు నీరవ నిర్జనంలో
మానవాత్మ నిశ్చల నిశీథంలో మేలుకొన్న

తల్లిలేని పిల్లనిలా ఏడ్చే ఈ క్షణంలో
కొడి కట్టిన దీపాలు, కక్కుతున్న కలాలు,
దున్నని పొలాలు, ఊరక పడిఉన్న హలాలు
భవిష్యద్విపత్తులను సూచించే స్వేదంలో
విగత విపశత్వం నిరూపించే ఖేదంలో
ప్రతి ఒక
మింటివైపు
మరలుతోంది శూన్యంగా
దైన్యంగా
వర్షంకొరకు
ఔను, బాంబుల వర్షంకొరకు
తెగింపులో, ముగింపు తెగింపులో.

---

# ప్రియురాలు

## వానమామలై వరదాచార్యులు



కౌండలను మేఘాలు కౌఁగానివిగ సేయ
పువ్వులన చుక్కలకు నవ్వులాసై పోవ
సింగిణీలు లతల తలపంగెనని జూపఁగఁ
నదులఁ గని రెంజాయ నాలుకలు సాచఁగఁ

గుముదాబ్జముల నధీనము సేయ రవిశశియు
ఆ వసుంధర నల్పునరయఁజీఁకటి మల్పు
దివికి క్రిందయ్యె భువిదీటె నావని యనుచు
ఆ రవిని గెల్వ ముందడుగిడు ప్రియ న్వెలుఁగు
కురులు కార్మొగిళులకు నుఖులగుచు వ్రేలాడఁ
జొక్కలను పలువడుస వెక్కిరించుచునుండ
నా సంజకెంజాయ నారగింపఁగ మోవి
కాటుకలఁదీర్పఁ జీఁకటి పేదు మాపఁగా
నిరులోకములఁ గెల్చి యెటు జూడ నీక న
స్పందాలరాశియై యాకర్షణము సేయు
ప్రియురాలివదనమ్ము బ్రియమౌట ఘనమె ?

---

## కిరణశకలం

దాశరథి

●

జలప్రపాతంలో వినబడు
విద్యుత్తు గుసగుస వలె
నా మనస్సులో ఏవో
భవిష్యత్తు మాటలు !

.... .... ....

ఆద్య పాషాణయుగం పోయి
విద్యుద్యుగం దిగిన ఈనాడు

ఏడ్చే దీనుని కన్నీళ్ళలో
ఎంతో కొంత విద్యుత్తు పుడుతుంది.

పరమాణువు పగులగొట్టి
ధరిత్రికి ప్రమాదాలు తెచ్చిన
"శిరస్సు"లకు బుద్ధి చెప్పే
స్ఫురస్ఫురత్ కవిత ఇది.

కోతిని మనిషిగా తొలిచిన
కాస్మిక్-రేడియేషన్ బలమే
నా కలంలో చొరబడి నేడు
మనిషిని దేవతగా మలుస్తుంది.

విద్యుత్తులా ఊహించగల మనకు
మద్యంలా పారే పాత ఛందస్సులో
పద్యం రచించడం పడదు.
అందుకే ఇలా రాస్తున్నాం.

ఇది విద్యుత్ ఛందస్సని
అందరికీ తెలసినదే.
ఇందులోని కవిత్వపు కిరణం
హృదయాంతస్సుల్ని శోధిస్తుంది.

"స్కైలీ"కి వాయుమండలంలో
అయిదోవంతు "ప్రాణం" వుందని
అదే మొదటిసారి తెలిసినట్లు
నాకో కొత్త మాట తెలిసింది

అదేమిటని అడిగేరా ?
అణువుల్ని పేల్చే యీనాడు
ఆ అయిదోవంతు "ప్రాణం"
అయిపోయిం దయిపోయిందని ।
పేలిస్తే విషపు గాలి
రాలిస్తే కన్నీరు
ఆలిస్తే ఆక్రందిన
కాలూనితే అడుగడుక్కీ విషక్రిముల.

చల్లని నీటిలో ఎంతో
జల విద్యుత్తున్నప్పుడు
పల్లెవాని గుండెల్లో
వెల్లుగా తిరుగు బాటుండదా ?
మూలపదార్థాల కోసం
వేలేళ్లు తపం చేసిన
శాస్త్రజ్ఞులవలె మేమూ
శాంతికొరకు తపిస్తాము.

యుద్ధాల మహాగ్నిలో
శాంతి నేడు జోనాఫ్ ఆర్క్ ।

పుట్టిని చుట్టిన జలనిధి
మాదిరి శాంతిని పెంచి
యుద్ధాన్ని ఎరెస్టు చేసి
మరణ శిక్ష విధిస్తాము.

చితిమంటల యుద్ధానికి
ప్రతి కవి ఒక ఫైర్ బ్రిగేడ్

అణు అస్త్రపు అరక్కరుచికి
ప్రతి పద్యం మబ్బు ముక్క
కలం అంటేనేగా బలం!
కలం లేంది బలం లేదు.
జనం అంటేనేగా మనం!
జనం లేంది మనం లేము.

---

# గేయం రాయాలి

సి. నారాయణ రెడ్డి

అంబరాల చుంబించే
అంతరాల స్పర్శించే
జలధరాల అధరాంచల
గళదింద్ర ధనుర్విచిత్ర
హాసం ప్రతిబింబించే
గేయం రాయాలి నేను
గేయం—

ప్రాగ్దిశా నిశావేదిక
పై నటియించే కౌటుక
చీకటి నటి కటిలో కద
లే కాంతి దుకూలాలను
దిసమొల తిరుగాడే
దీన జగతి కందించగ
గేయం రాయాలి నేను
గేయం—
నిరంతరం తరుణీ సుం
దరముఖ దర్పణంలోన
తమ తారుణ్యం పొంగుల
దర్శించే హర్షించే
ప్రేమనామ భక్తులకో
కాముక జాగ్రస్తులకో
విషయసుఖస్మృతుల కందని
విశ్వప్రేమ పతాక వి
కస్వరకాంతులు చిందగ
గేయం రాయాలి నేను
గేయం—
అడుగడుగున జడలెత్తుక
సుడిగుండం తడబడగా
క్షణక్షణం కంఠాల మ
రణసూత్రం ముడివడగా

తరాల నైరాశ్యంతో
దాటరాని దాస్యంతో
కంపల్లా కంపించే
కంపల్లో నివసించే
సంధ్యాజీవుల భయ వి
స్ఫారనేత్ర వీధులలో
హ్లాదం మోదం దించగ
అమృతశాంతి కురిపించగ
గేయం రాయాలి నేను
గేయం—
స్నేహానికి దాయలుగా
ద్వేషానికి దాసులుగా
శతాబ్దాలనుండి దళిత
జనరక్త పిపాసులుగా
ప్రపంచాన్ని తమ పిడికిటి
పంజరాన బంధించిన
ఈనాటి మతోన్మాదుల
ఈనాటి ధనోన్మాదుల
కుత్సితాలు విడగొట్టగ
మత్సరాల నరికట్టగ
గేయం రాయాలి నేను
గేయం—



# సరస్వతీ భక్తుల్లారా!

కాళోజీ నారాయణరావు



కైతకు లక్షణాలున్నాయి కోటొక్కటి.
వానిలో వ్యాకరణంకూడా ఒక్కటి.
మీకు దాని సూత్రాలే సర్వస్వం;
గొంతుకు పోసుకొని వ్రేలాడి సతతం.
చేస్తారు ఆక్రందన; అంటారు కవిత్వం!

"కైతకు వ్యాకరణమే పరమావధి
కాదు. అసలేకాదు" అన్నాడు దాశరథి!
మా రచనలో వ్యాకరణం మాత్రమేలేదు.
మీరచనంతా వ్యాకరణం: మరేమీకాదు.
వ్యాకరణ సూత్రాలు పెట్టితే భట్టి.
కాదెప్పుడు కైతపాకం గట్టి.

పాతబాటలబట్టియే నడుపగలరు మీరు.
మా నడకలో పడుతుంది క్రొత్తత్రోవలకు తీరు.
శతాబ్దాల తరబడి ప్రవాహంలోపడి
రాపిడి పద్యాన, రూపురేఖలు దిద్దుకొన్న

ముద్దువచ్చే రాళ్ళను సాలిగ్రామాలని
కన్నుల కద్దుకొని భక్తులు పూజకై దాచుకొన్నట్లు
మానోట రాలిన మాట
ఆ నోటా ఆ నోటా
వినవింపై, మనసుకు పసంపై
జపించి జపించి
సూత్రాలలో బిగించి
సారస్వత పూజాద్రవ్యంగా
భద్రపరుచుకున్నారు మీ వైయాకరణులు.
అప్పుడప్పుడు పేమున్నదే అయినది
మీ అప్పకవీయం, కౌముది,
సరస్వతీ భక్తుల్లారా !
బ్రహ్మనే వెక్కిరిస్తారా !
మెరపుపలె పరుగిడు
మా. ఊహాతరంగాలకు
టక్కెద్దులనాపే
పగ్గాలు పనికొస్తాయా ?
హైడ్రాలిక్ బ్రేక్సుకూడా ఫేలవుతున్నప్పుడు
ప్రళయ జలధిని నింపదలచిన ప్రవాహాన్ని
ఆపడానికీ మీ ఆనకట్టలు పనికొస్తాయా
హిమాలయ పర్వతపంక్తులే, తలలువంచుకుంటున్నప్పుడు;
ఎన్నెన్ని జన్మాలెత్తి
ఎంత పొంకంగా రాసినా లేఖకుడు
మహారచయిత అనబడడు.

వలయాలూ, చతుర్భుజాలూ
వివిధ కోణాకారాలు
నీటుగా వేసే రేఖాగణితజ్ఞుడు
మహా చిత్రకారు డనబడడు.

చిత్రకారుడు గీసిన
జీవితముట్టిపడే చిత్తరువులో
అవయవాల సొంపునుజూపే
ఎత్తువంపుల కాధారమైన గీతలు
వంకరటింకరగా ఉన్నాయన్న 'రేఖకుడు'—
మా రచనల్లో తప్పులున్నాయనే వైయాకరణి.

---

## అరుణ

'కరుణశ్రీ'



యువభారత యుగోదయంలో
నవభారత మహోదయంలో
పూచిందొక అరుణతరంగం
లేచిందొక క్రాంతి విహంగం

కంఠంలో విప్లవరాగం
గమనంలో విద్యుద్వేగం
దేశానికి నవసందేశం
లోకానికి నూత్నాలోకం

త్యాగోజ్జ్వల మహిమా మండిత
రాగారుణ రక్తపతాకం
నవభారత హృదయాంబరమున
ప్రసరించిన మహేంద్రచాపం

చైతన్యం జీవిత లక్ష్యం
స్వాతంత్ర్యం అంతస్సాక్ష్యం
ప్రాచీ దిగ్ దృగంచలంలో
రోచిస్సులు చిలికే కిరణం

అజ్ఞాతం అతిక్రమించిన
ప్రజ్ఞామయ విజయవిహారం
కురుక్షేత్ర సంగ్రామానికి
గురిపెట్టిన ఘన గాండీవం.



# మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళుతున్నాను

—◆—

దా శ ర థి



చెట్లు నడిస్తే ఎంత భయంకరమో
అట్లా చీకట్లు నడుస్తున్న ఈనాడు
అంతా నిద్రపోతున్నారు నీడల్లో—
కాలరాక్షసి అడుగు జాడల్లో.

ఎపుడో అనంగా విన్నమాట సుమా! ఇది—
'ఎక్కడో ఎవ్వడో మేలుకొన్నాడ'ని.
విచిత్రమే ఈ అర్ధరాత్రి మెల్కోడం:
అయినా చూచిరావడం మంచిది.

నేనుమాత్రం మేల్కొని వున్నాననా!
పిచ్చిది! ఇదీ కలలోని ప్రస్తానం.
కలలోనైనా మేల్కొన్నవాణ్ణి చూడ్డం
ఘనవిషయం కాదా ఈనాటి లోకంలో!

శవం బతకడం ఎంత విచిత్రమో
మనం మేలుకోవడం అంత చిత్రమే.

ఎవడో కొత్తరకం మేటి వైద్యుడు
ఏదో కొత్తతరహా అవుషధం వాడివుండాలి.

లేంది ఇన్నాళ్ల నల్లమందు మత్తు
ఇంత త్వరగా విడిపోవడం సులభమా!
ఏమైతేం వెళ్లి చూచిరావడం మంచిది;
మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళుతున్నాను.

# క్షుభితపథయాత్ర

సోమసుందర్



మెతుకు వెదకి స్రుక్కినాను.
బ్రతుకు తెరువు కానలేను;
బరువు మోయలేదు మేను
కరువు చెరుపు నీదలేను.

ఆశల తేనెల సోనలు
కారిచి పుప్పొడుల రాల్చి.
రేకులూడ్చి తొడిమపీడి
నేలపడిన పూవు నేను.

వలపుటలరు చెలివా తెర
చిరునగవుల సురభిళాల
కోరి మదోన్మత్త యాత్ర
సలుపు మధుపరాజు నేను.

కాంత హృదయ కాంతారపు
టల్లిబిల్లి చిక్కులలో
తెలదూరిచి వెలికిరాక
తన్నుకునే ముప్పనేను.

నరికేసని మధ్యాహ్నపు
టిసుకతిన్నె బయళులను-ని
దాఘతప్త శుష్క మరీ
చుల వెదకే దప్పి నేను।

గరికిచిగురు కొరకలేని
తల్లిలేని లేగదూడ
పసికన్నుల పాపతెత్తి
కులిపించే జాలి నేను.

పడిలేచే-విరిగి పడే
ఒడ్డులొరసి తలలుచెడే
అలసట నురగలు క్రక్కే
అలల కలల జలధి నేను.

పొన్నచెట్ల-పొగడచెట్ల
శాఖావయముల ఛాయల-

వనల సువాసనలు చిలిపి
పసి పిల్లల ఆటలటుల :

భూరుహాల-కొమ్మల కుసు
మాల-చలువనీడల మెఱు
పేదతీర్చు వలపుతావు
లెన్నిటికో దూరపునేను.

వేగ జటాయువు వాయస
వ్యాఘ్ర వ్యాళ క్షుద్రవితతి
పీడించే - పీల్చితినే
జీవకళేబరం నేను :

నత్త ఎఱ్ఱ పీత లూత
ఈగ దోమ పడ్లచిలుక
జెర్రి తేలు మండ్రగబ్బ
లేల నిండె నా మార్గము ?

పొలి గాలిన పులుసుముద్ద
గొంతుదిగక. ఊర్పులణగ
కంఠపరిస్పృతము లగుచు
సరీసృపము లతిశయించ :

వెతల కతల కలత పూరి
పడి మురిగి కృశించలేక,
క్షుభిత పథాంతర యాత్రను
పడినడిచే శక్తిలేక :

ఇంద్రజాల విశ్వసృష్టి
కాదియెప్పుడో అరయలేక,
జీవపదార్థముల మూల
బీజములను వెదుకలేక :

వెదుకలేక బ్రతుకలేక
అరయలేక శక్తిలేక
క్షుభిత పథాంతర యాత్రల
శోషిల్లే వగ్గు నేను !

అయినా నా సౌపట వ్రేలు
ఘన్నవారి ఘూర్ణం నడుమ
అంతరంగ జీవితేచ్ఛ
నేసిన నుసుసిగ్గు నేను.

పరిమాణపు కన్న యెడద
నిజంసుమా బహు స్వల్పం !
బ్రహ్మాండం కన్న హృదయ
మనసపరితం మహత్తరం !

ప్రళయహరుని విషమనేత్ర
జనితానల విషజ్వాల—
జగజ్జన సమాజ హృదయ
పరివర్తిత క్రాంతికీల—

విస్మయముల నిశితనేత్ర
యుగ్మము దర్శించునూత్న

యుదోదయ శుభోత్సవమును
రాగరంజిత మ్యోమనర్చె!

అయినా నా మనోవీధి-
పరిక్లేశ బలితాకృతి
ఆక్రందన రోదన- బు
న్మత్త నృత్యకేళి సలుపు!

తల్లీ! పుడమీ, నాయెద
కేల యీవిషాద గాధ?
తల్లీ! పుడమీ, మదీయ
భాగ్యరేఖ లెచట గలవు?

అమ్మా! పృధివీ నా మది
కేల తెలుపు మీ వేదన?
లమ్మా! పృధివీ - నా బ్రతుకు
కెచ్చటకీ శుభయాత్ర?

---

# కరటకదమనకులు

---

'మల్లికార్జున్'



'కరటకదమనకు'లధి
కార పీఠమాక్రమించినప్పుడు—
పరిస్థితులు గరళంగా
పరిణమించినప్పుడు—

సంజీవకుడైన ప్రతివాడూ
భంజనక్రియు దప్పతాడు.
ప్రతివాడు స్వార్థంకోసం
ప్రగల్భాల దుప్పటికప్పి
వేస్తాడు చిత్రమైన వేషం
ఆశయ సంప్రాప్తికోసం
అవతరిస్తుంది ఆవేశం.
పట్టిస్తే యథార్థస్వరూపం
వస్తుంది అందరికీ కోపం
'కర్ర ఎవ్వనిదో వానిదే బర్రె'
కావాలంటుంది మనిషిపుర్రె.
వాసనలేని కుసుమాలు
వర్ణం గట్టితేనే చాలు
పిన్నన్న చెప్పిందే వేదం
విన్నంతసేపూ వినోదం.

---

## తొమ్మిదితో కుచ్చా

---

ఆరుద్ర

●

వస్తున్నా వస్తున్నా
కాస్తా ఆగు।
ఇది నిటారుమిట్ట
నను పైకిలాగు

ఎత్తుతెలియని నిటారు
నిట్టనిలువు అనంతం
"ఎన్నడులు ?" ఎదమున్నుకొంటూ
భయం విస్మయ మేస్తోంది
మెస్మరించింది యవ్వనం నన్ను
విస్మరించాను లోకమా ! నిన్ను
నరకం ఇప్పుడుంటున్నది ఇది నాకొద్దు
స్వర్గం చూపిస్తావా ? ఎందుకు పోనిద్దు
త్రిశంకుస్వర్గమిస్తావా ? అదికూడా వద్దు
పలురకములు సౌఖ్యమ్ములు పాతకాలపద్దు
నలుచదరపు భోజనమ్ము నాకుఇయ్యవద్దు
చెలిపోడిమి నిరర్ధకం రేపటికదిపద్దు
మూఢతమో గాఢతలో సఖిగాజుల సద్దు
గాఢ పరిష్వంగంలో వేడివేడి ముద్దు
గబ్బుకొట్టు నరకానికి ఇవతలి సరిహద్దు
ఊబిలోన ఈదడమా
ఊహాలలో బ్రతకడమా
గర్జింపుము గర్జింపుము గమ్యం సామీప్యం
విసర్జించు విసర్జించు విసర్జించు జాప్యం
రాదు రాదు రాదు ఎడదకు వృద్ధాప్యం
తెరువంబడె తెరచుకొనని దివ్యలోక దేహళి
వినవయ్యెను బధిరులకే విరోచిత కాహళి
వస్తున్నా వస్తున్నా
కాస్తా ఆగు
చేయూత నిచ్చి మిత్రమా !
మున్ముందుకు సాగు.



# ద్వంద్వాతీతం

నార్ల వెంకటేశ్వరరావు



వెలుగు వెనుకనె యిరులు,
ఇరుల వెనుకనె వెలుగు—
అటు చూడు!
ఉదయ సంధ్యారాగః!

ఎండలోనే వాన
వానలోనే యెండ—
ఇటు తిరుగు
ఇంద్రచాపం సొబగు!

బ్రతుకు వెన్నంటి మృతి,
మృతినీడనే బ్రతుకు—
వినవేమి?
పురిటింటి కేరింత!

# కష్టజీవి

పైడిపఱ్ఱి వేంకటసుబ్బారావు



కాల పురుషరథాంగ - ఘట్టనల చూర్ణమై
ధూళిలో గలిసియు, గాలిలో నెగసియు
మొగము దీరము విడని - మగవాడవీవోయి.

లోకమ్ము చెడుమంచి - తూకముల వెలగట్టి
తెలిపేది నీగుండె - పలికేది నీమనసు.
పలుకు నీ పెదవికద బంధితంబగునోయి.

వెలలేని ధనరాసి కలిమి గురికేవారు
కనలేని దుర్భర కష్టాలను సహించు
ఘనశక్తి యొక్కటే - కన్నాడవీవోయి.

కష్టముల ననిశంబు యిష్టమని పీడకను
నీయింట కాపురము - నిలిపి ఆకష్టాల
ఎల్లప్పుడాహ్వాన మిచ్చు ఘనుడీవోయి.

కష్టాలె నీకాళ్లు కడిగి తలదాల్చంగ
సుఖములును నీయంఘ్రి సోలి శిరముంచంగ
బ్రహ్మతోనైననే పని నీకు లేదోయి.

అగ్నితాపము గాంచనట్టి మేలిమి లేదు,
విరహ మెరుగని ప్రేమ విహ్వలత లేదోయి.
కష్టజీవులు లేని సృష్టియే లేదోయి.

# ఖర

---

## కాళోజి నారాయణరావు



నడుమ కాలమానంలో ఖరసంవత్సర మొకటా ?
గాడిద పేరిటగూడా ఏడాదొకటుండాలా ?

అరవదేండ్ల కొకసారి ఆదరి బాదరి పడుతూ
తనమాదిరి దీనులపై దయచూపగ రాదుగదా ?

బ్రతుకుల సామ్యం చూపే దాపైతే కాదుగదా ?
నాకలి మూపిపె గానీ చాకిరైతె తప్పదనా ?

ముస్తాబుల తీరు చూచి మూటబరువు తగ్గదనా ?
ఓపిక తగ్గియు మనిషి ముద్ర ఏల పెట్టదనా ?

ఖ్యాతి కొరకొ మేత కొరకొ చేతగాని చేతజేసి
చేటైనను చోటైనను మూట మేల దింపదనా ?

అనామకుని ధీశక్తిని అడిగేవాడే లేడు
అదంటయి యుక్తమైన పేదదొమ్మయైన చాలు.

కావ్యదీక్ష సహనశక్తి కలిగిన చాలదు చాలదు
పేరు ప్రతిష్ఠలు నడసిన వారలకే గొంటాలు.

బ్రహ్మరథం, పల్లకీలు పగటి దివిటీ గౌరవాలు
ఇంటింటా విగ్రహాలు ఏటేటా ఉత్సవాలు.

మాడుపొట్టతోడ తాను గాడిదచాకిరి చేయగ
తోకవూపి మూతినాకు తుచ్ఛులకే వైభవాలు.

వెన్నుపూస బొక్క విరుగ తన్నుకోని మోసినను
అనాదరణ అవహేళన సనాతనం ఈ జగాన.



# నాడు నేడు



భాగి



అలలన్ని కల లాయె
కలలన్ని శిల లాయె
శిలలన్ని తల వొంచి
ఇల నిలువ—

ఎటనుంటినో నేను
ఎటు గంటినో నిన్ను
నటరాజువై నీవు
నటియింపగా—

శిలలోని కల లన్ని
అలలగుచు ఇల వెలుగ,
శిలలోని తొలి పూట
చిరితేట కిల తనిసి
పులకింప

శిలలోని నిను నింపి
కలలోని కరుగుతూ
అలలోని కమ్ముతూ
నటరాజువై నీవు
నటియింప నేడు.

---

## జీ వి త ం

---

పొట్లపల్లి రామారావు



జీవితమొక ఆరాటము
జీవితమొక పోరాటము

నిమిషమాత్ర మైన సరె
నీ ధ్యేయము మరవరాదు
లెమ్ము! లెమ్ము! ఓ పథికుడ
లెమ్ము! లెమ్ము! ఓ పథికుడ

నిస్తబ్ధత నిర్వీర్యత
నిరాశ, నిస్పృహలన్నీ
వదలము పీడుడిపడె నీ
గమ్యము దెసవెసుచూడక

ఆరాటము లేని చోట
పోరాటం బెటులుండును ?
అనవరతాన్వేదనమె
అభివృద్ధికి మూలమునియ

పోరాటము కాని నీవు
భువిని బ్రతుకలేవు ఎప్పుడు
యిష్టము లేకున్ననేమి
ఏదో ఒక వెత తప్పదు

అసంతృప్తి, అన్వేషణ
ఆవేదన, ఆలోచన
అహరహంబు హృదినిండిన
ఆత్మకిచ్చు నవియె శక్తి

పోరాటం బనిననీకు
భయంబేలనోయి సఖా !
పోరులేక ఏగతిభువి
పురోగమన మొందెదీవు ?

పురోగమన మొకటె నీదు
పూర్ణత్వమునకు మూలము

పురోగమన మాగినచో
తిరోగమనమె తగయిక

నీ గమ్యము పైనిచూడక
నేలకినితరము నిలిపినప్పుడె
అంధకార బంధురమౌ
పొందినమౌ నీదుదారి

నీ సుందర స్వప్నాలకు
నిమిష. నిమిష మునకు నీవు
శక్తి ధారపోసినచో
సాక్షాత్కారము నిశ్చయము.

ఊహాలు. పోహాలు లేని
ఉజ్జ్వల స్వప్నాలు లేని
ఎడారి జీవన మేటికి ?
ఏటికి ఆ వెతగు బ్రదుకు ?

తుచ్ఛ కామముల కన్నను
నూర కాంక్షనె ఎప్పుడు
నింగిపైకి నెత్తునోయి
నిను వీరిని పూలవంద

అపజయాల కడలినీదు
అంధుడవై క్రుంగిపోకు
అపజయాల మూలము నీ
అశ్రువులోనె కల దెరుగుము

వేదనాగ్ని పూర్ణమైన
విమల.హృదిని నల్పములౌ
కామంబులు చేరజనవు
కాలునగ్ని మిడతలగతి

అర్థమనస్కత నెప్పుడు
ఆచరింపబోకు పనులు
పూర్ణాహుతి లేనిదె హృది
పుష్టి తుష్టి కలగబోదు

గమ్యముపై దృష్టి నిలిపి
గ్రాలువరకె నీదుబ్రతుకు
ఆదర్శచ్యుతుడవైన
ఆ క్షణమె మరణమెసగు

కత్తిపైని నడకసుమి
గమ్యమున్నవారి బ్రతుకు
కన్నుమూత పడగరాదు
కాయము ఘవినిల్పవలెను

నీ గమ్యము చేరువరకు
నిలపబోకు పోరాటము
నిష్ఠఒకటె చాలుమదిని
కష్టాలవె గడిచిపోవు.



హిమానీ శిలాస్త్రులంలా ప్రవహిస్తున్నావేం ?
ఎన్నివజ్రాలు రత్నాలిలా కనవి కరిగి
ఏర్లై రత్నగర్భ నీటిబుగ్గై ఒరిగి
జలప్రళయంలో శవాల నావలు
తేలాలో,
ప్రపంచానికంతటా ఏ నాంత్రి
మృతసందేశం వినిపించాలో.
ఏం విరుతిస్తున్నావ్-
ఏ గోళంనుండి విరిగిపడ్డ
రీ సుడిగుండా
లీ సెగపిండాలు ?
ఏ బిల్లుల్లో తయారైన
నీ గొంతులుకోసే తడిగుడ్డలు !
ఏ గృధ్రబృందం చప్పరించినవి
ముక్కలైన యీ నెత్తుటికండల టొమాటోలు ?
ఎవరిని ప్రశ్నిస్తావు ?
ఎవరని ప్రశ్నిస్తావు ?



# అసిధార

పి. వి. రామవర్సయ్య



నాకు నేనే. నాకు నేనే.
నా పరిసర ప్రాంతం
నిర్వాసం. నిరాశ్రయం
నా బ్రతుకు [illegible]ంతిబద్ధ
పరిమాణము అగణితము ।
మున్ను పెరిగి మీదపడే
మా పనులకు సంకేతం ।

జీవనమూ...మాధుర్యము
అనదము విన్నానుకాని
కనేవన్ని కంటకాలు
నడకంతా రాళ్ళదారి ।

నిరుద్యోగ విషవలయం
ముంచుకొచ్చె నామనుగడ
దారిద్ర్య పిశాచానికి.
ఎరఅయినది బ్రతుకంతా ।
నిరుద్యోగ విషసర్పపు

కొటుబడిన నా రోదన,
వినేందుకు చెవులెక్కడ ?

ఈదలేను వ్యథాభరిత
సాగరాల పరంపరల.
దాటలేను. నిరాదరణ,
తీరాలను. ఘోరాలను,
చేరలేను. చేరలేను.
సమతా, సహనపురేవు ।

కలవారల పరమార్థం
పైకుబికే ఈ స్వార్థం
శేషించిన నిరంకుశత్వం
తెగనివ్వవు బంధనాలు ।
జారనీదు దిగుడుమెట్టు
శేషించిన నిరంకుశత్వం
తెగనివ్వవు బంధనాలు ।।

నిరాశ నాకున్న ధనం
నిస్పృహ నా ప్రేమవనం,
నా ధనాన్ని పంచుకొనగ
నా వనాన విహరించగ.
ఎవరులేరు, ఎవరురారు
ఎవరులేని నేనొకడనె ।

నాకు నేనే, నాకు నేనే,
బ్రతికియున్నా, చితికియున్నా
గెలిచియున్నా-ఓడినియున్నా
నాకు నేనే, నాకు నేనే
నిస్వార్థం నాకున్న ధనం
నిర్యాణం నా ప్రియసదనం

జీవనమూ మాధుర్యం
పసందం అన్నాను కాని
కనేవన్నీ కంటకాలు
నడకంతా రాళ్ళదారి !!!



# భవితవ్యం వేపు



**సింగరాజు లింగమూర్తి**



మానవజాతి వికాసానికి
మరిచిపోయిన చరిత్రపుటలు తిరగవేసి
మన సంస్కృతి, మన వైరుధ్యం—ఒక్కసారి
మననం చేసుకుంటే చాలు—

మనం ఎక్కడున్నామో, ఎంతవరకు పురోగమించామో
మన ప్రాభవం ఎటువంటిదో
తెలుసుకుంటాము !
తలుచుకుంటాము !
భవిష్య దభివృద్ధికి
పునాదులు వేసుకుంటాము !
మనమెంతో పురోగమించామని
మనమంతా స్వతంత్ర పౌరులమని
మన రాజ్యాంగం—మనకై
మంచిమార్గాలు చూపిందని
మురిసిపోవడం లక్ష్యంకాదు భాయీ !
మనపునాదులు గట్టిపడేందుకు
మనలక్ష్యం సిద్ధించేందుకు
మాటలు కాదోయ్ ప్రధానం !
పదవులు కాదోయ్ మనలక్ష్యం !
నీ జాతికి, నీ దేశానికి
నిస్వార్థసేవ చేశానని
గుండెమీద చేయి వేసు
కొని చెప్పే దమ్ములున్నాయా ?
స్వార్థం బురఖా మాటున
సర్వ సమత్వపు లెక్చర్లా ?
అధికార ప్రాభవంకోసం
అసత్య ప్రచారాలా ?
తెల్లని 'పరదా'లో దాగిన

నల్ల రాకాసి వికవికలు ;
పొగలై, సెగలై రగిలి రగిలి
పగిలిన హృదయాల ఘోషలు :
వినబడటంలేదా తమ్ముడూ ?
వినబడవు—ఎందుకు వినబడుతాయి ?
నీ కర్ణపుటాల నిర్మాణం
ఏ శిలాఫలక శ్రీకారాలో ?
నీ హృదయపుష్ప నిర్మాణం
ఏ కళాఫలక నిర్మాల్యమో ?

---

## పిల్లలమండీ పిల్లలము

---

వెల్దుర్తి మాణిక్యరావు



పిల్లలమండీ
పిల్లలము,
    సీతాకోకా
    చిలుకలమూ.
పాపం, పుణ్యం
కోపం, తాపం,

ఎరుగని మిణుగురు
పురుగులమూ.

పిల్లలమండీ
పిల్లలమూ.

చిగురుటాకులే
చిన్ని స్నేహితులు

మొగ్గలు మాకు
దగ్గరి చుట్టాల్

పువ్వులజూచీ
నవ్వెదమూ.

చిలుకలవోలే
వాగెదమూ.

రంగులజూచీ
పొంగెదమూ.

పాటల; తియ్యని
మాటల వింటూ

ముసిముసినవ్వుల
మురిసెదమూ.

పిల్లలమండీ.
పిల్లలమూ.

ఇంద్ర ధనువుపై
ఉండే రంగుల

లంగా జాకెట్
అంగి తొడిగి
తీరిక లేక
తిరిగెదమూ

అందరి జేరీ
అరిచెదమూ
పిల్లలమండీ
పిల్లలమూ
సీతాకోకా
చిలుకలమూ.

---

## హి రో షి మా

'రెంటాల'



సంగ్రామపు విలయనృత్య
సాంకేతిక కల్పద్రుమ
హిరోషిమా!

చారిత్రక గ్రంథాక్షర
గాథాయథార్థాల ప్రతిమ
హిరోషిమా!

**విలపించకు, పలవించకు**
విలపిస్తూ, పలవిస్తూ
**తపియించకు, శపియించకు—**

రాబొయ్యే యుగానికి
నీవేలే మొదటిరోజు
రాబొయ్యే రికార్డుకు
నీదేలే మొదటి పేజీ—

నీ నొసటను తిలకరేఖ
తుడిచేసిన దుర్మార్గుడు.
నీ పాపిట చంద్ర వంక
దోచుకున్న దుండగీడు.
నీ రంగుల కంకణాలు
చిట్లించిన నికృష్టుడు,
నీగళమున పగడహార
మపహరించిన మారీచుడు,

నీ కంఠం ఉరిత్రాడుకు
తగిలించిన కిరాతుడు,
నీ బంగారు మాంగల్యం
తెగత్రెంచిన విషకత్తెర,
నీ రొమ్మున పసిపాపను
వేరుచేసె నే దుష్టుడు,
నీ శయ్యా మందిరమును
మంటకలిపె నే రక్కసి,

సమయమునులే, సమయమునులే
సమసిపోవు సమయమదే।

నీ గ్రామం బుగ్గి చేసి
నీ నగరం కూలద్రోసి
నీ గ్రామం నీ నగరం
నీ క్షేమం పాడుచేసి
నవ్వుకున్న దుష్టత్వం
నశిస్తుంది. నశిస్తుంది
నశిస్తుంది, ఇది నిజం :

నీ మానం కొల్లగొట్టి
నీ గర్భం క్షోభపెట్టి
నీ భూములు చిగులపెట్టి
నీ తీగెలు పగులగొట్టి
పగలబడ్డ పచ్చి విషం
లయిస్తుంది. లయిస్తుంది
లయిస్తుంది, ఇది సత్యం।

నిను రక్తంలో ముంచెత్తిన
నీపై నల్లని వస్త్రం కప్పిన
నీపై ప్రళయంగా నర్తించిన
నిను స్మశానవాటిక చేసిన
రణం, వ్రణం. మారణం. మృత్యువు
అమానుషం. ఘోరం, అతి భయంకరం
పటపట బ్రద్దలయి

నామరూప రహితంగా
నశిస్తుంది, నశిస్తుంది
నశిస్తుంది, ఇది తథ్యం।

అమ్మా। ఉమా। రుమా।
హిరోషిమా।।

నీ స్మశాన వేదికపై
తొలకరి వానలు కురియునులే;
నీ అనాథ సమాధిపై
'ఎర్ర పూలు' పూయునులే:
నీ వదనంలో పచ్చని
రేఖలు వెలుగునులే:
నీ హృదయంలో హర్షాబ్జపు
రేకులు విరియునులే;
నీ ముంగిట బంగరు
భానుడు ఉదయించునులే:
నవ చైతన్యంతో
'పునస్సృష్టి' జరుగునులే:
నీ ఒడిలో చిరునవ్వుల
పాపలు దోగాడునులే:
నీ సౌభాగ్యం చిరస్థాయిగా
నిలుచునులే;
నీ గృహం మంగళ
తోరణములతో భాసించునులే।।।



# వెన్నెల



**నార్ల వెంకటేశ్వరరావు**



ఇందు వెన్నెల
అందు వెన్నెల
అందముల చిందించు వెన్నెల

ఇంపు వెన్నెల
సొంపు వెన్నెల
జొంపముల కంపించు వెన్నెల

తెరల వెన్నెల
కెరలు వెన్నెల
కెరటముల క్రీడించు వెన్నెల

ఇగురు వెన్నెల
నెగడు వెన్నెల
నగములను నవ్వించు వెన్నెల

నిండు వెన్నెల
పండు వెన్నెల
పండుగను పలికించు వెన్నెల

పాల వెన్నెల
పూల వెన్నెల
కాలమును కరిగించు వెన్నెల

పిండి వెన్నెల
పెండి వెన్నెల
గుండెలను పండించు వెన్నెల

లేని వెన్నెల
సోన వెన్నెల
మానవుని మంత్రించు వెన్నెల

---

## ఓ రజనీ!!

'పుట్టపర్తి'



ఓ రజనీ రమణీ!
నిశ్శబ్ద విలాసినీ!
నీ యడుగుల నిభృత గాన
మీ యెదలో బలికినదే!
యెవని కొఱకు—అభిసరించు
చున్నావే!

ఓ రజనీ రమణీ!

గత కాలము నీ చేలము
గా—-మృతి నీ చెలిమై
అంతులేని దారి పయన
మైనావే!

ఓ రజనీ రమణీ!

వీడిన వెంౘ్రుక వేమే!
మాడిన ముఖమేమే! యిం
కెంతకాలమే! నీకీ
నిర్వేదం

ఓ రజనీ రమణీ!

ఆగు మాగుమొక్కపరి—అ
భాగ్యజీవి! నీ కన్నుల
యంచులలో నా గానం
చూచేనే!

ఓ రజనీ రమణీ!!!



# ఎవరివి - ఎక్కడ

II

